# సుగంధ పరిమళాల మార్గంలో

చందన పెద్ద గంధపు వృక్షం కేసి అమితాశ్చర్యంతో చూడసాగింది. ఆ వృక్షానికి ఎన్నేళ్ళు ఉంటాయి! అది ఎంత హుందాగా ఉంది! ఎలాంటి పరిమళాన్ని వెదజల్లుతోంది!




ఏమిటిది? నువ్వు చందనం సబ్బు, పౌడర్, చందనం ఏదీ ఉపయోగించవా? చెమటకాయలను పోగొట్టే శక్తి చందనానికి ఉందని రెండు వేల సంవత్సరాలకు పూర్వమే మన ఆయుర్వేదం గుర్తించింది. యువతులు శరీరంలో వేడిని తగ్గించుకోవడానికీ, చర్మరక్షణకూ ఒళ్ళంతా చందనం పూసుకునేవారని మహాకవి కాళిదాసు తన ఋతుసంహార కావ్యంలో వర్ణించాడు!

క్రీ.పూ. 5వ శతాబ్దానికి చెందిన వేదవ్యాఖ్యానం 'నిరుక్తం' లోనూ, పతంజలి మహాభాష్యం (క్రీ.పూ. 100), కౌటిల్యుడి అర్థశాస్త్రం (క్రీ.పూ. 200) లోనూ, రామాయణ మహాభారత గ్రంథాలలోనూ చందనం గురించి ప్రస్తావించబడివుంది.

మైసూర్ శాండల్ సంస్థ గత 80 సంవత్సరాలకు పైగా చందనం శ్రేష్ఠతను మీ ఇళ్ళల్లోకి తీసుకువస్తోంది.




## సుగంధ వినోదం

మీరు ఉపయోగించే చందనం గురించి మీకు ఎంతవరకు తెలుసు? ఈ ప్రశ్నలకు సమాధానాలు చెప్పి తెలుసుకోండి.

1. గంధపు వృక్షాలు శంఖాకార వృక్షాలు/ సతత హరితాలు/ ఋతువులకు అనుగుణంగా చిగురించి, ఆకులురాల్చే వృక్షాలు.
2. గంధపు చెట్లను ఉపయోగించడానికి మొదలంట నరుకుతారు/సమూలంగా పెకలిస్తారు.
3. గంధపు చెట్టు బెరడు/ లోపలి మెత్తటి చెక్క/ ఆకుల నుంచి గంధంనూనె తయారుచేస్తారు.
4. వృక్షానికి పూర్తి పరిపక్వత రావడానికి 10-20/ 60-70/100-120 సంవత్సరాలు పడతాయి.

సమాధానాలు
1. సతతహరితాలు 2. సమూలంగా పెకలిస్తారు.
3 లోపలి మెత్తటి చెక్క 4. 60-70

A 
ACTIVE

B 
BUZZ BOSS

C 
CADET DX

D 
DEVIL DX

E 
ELEPHANT

F 
FISH

G 
GIRAFFE

H 
HEN

I 
INSECT

J 
JOKER

K 
KIDD DX

L 

LAMBADA LIMBO

M 
MISSILE MISS INDIA Jr

N 
NEST

O 
ORANGE

P 
PIRANHA

Q 
QUEEN Jr

R 
ROBO COP

S  
SPARKY SALSA

T
TERMINATOR




V

W

The largest range of kids bikes

**HERO CYCLES**

THE ABC OF CYCLING

HTA.5979.2001

ఈ నెల విశేషాలు సంపుటి 106 జూలై 2002 సంచిక 1



రాజభక్తి! (బే.క) 19



మన పూర్వగాథలు 24



మాయాసరోవరం 11



రహస్య సన్మానం 27



## ఈ సంచికలో


★సుకర్ముడి కల...8 ★మాయాసరోవరం-6 .. 11
★ ఏమిటి దానిగొప్ప ..18 ★రాజభక్తి!(బే.క)..19
★మనపూర్వగాథలు-3..24 ★రహస్య సన్మానం ...27
★హాస్యచతురులు:..30 ★ మీకు తెలుసా?- క్విజ్ ..32
★తండ్రీకొడుకుల కథ .. 33 ★భారతదర్శిని .. 37
★తేజిమాల (అస్సాం జానపదకథ)..38 చందమామ
కబుర్లు ..44 ★విఘ్నేశ్వరుడు-7..45
★రామబంటు.. 51 ★పోలయ్య నిర్వాకం ..55
★అజేయుడు గరుడుడు-17.. 59
★వినోద సమయం..64
★ఫోటోవ్యాఖ్యల పోటీ..66

మీరే చేసుకోవచ్చు
పట్టపుటేనుగు
(రేఖాచిత్రం)..34బి





**SUBSCRIPTION**

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of***
***Chandmama India Ltd.***
**to**
**Subscription Division**
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్‌ద్వారా రూ.**120**లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా
గానీ,మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్
పేరిట పంపండి':

ఈ పత్రికలో ప్రకటనల
కోసం సంప్రదించండి:

చెన్నయ్
ఫోన్ : 044-234 7384,
234 7399

ఢిల్లీ
మోనా భాటియా
ఫోన్:011-651 5111/
656 5513/656 5516

ముంబాయి
షకీల్ ముల్లా
మొబైల్ :**98203-02880**
ఫోన్ : 022-266 1599/266 1946/
265 3057

# పాఠకుల లేఖలు

చందమామ శరత్కాలపు వెన్నెలలా చల్లని కాంతులు వెదజల్లే కథలతో అలరారుతున్నది. మానవజన్మను ఏవిధంగా సార్థకత చేసుకోవాలో కమ్మని కథలద్వారా సులభశైలిలో బోధిస్తున్నది(పిల్లలకూ, పెద్దలకూ). ప్రతినెలా అన్నిభాషలలో ఒకే కథలను వేయడంవల్ల ఇతర భాషలు నేర్చుకోవాలనుకునేవారికి ఎంతో ఉపయోగంగా ఉంది. భారతీయ సంస్కృతీ వారసత్వాలకు ప్రతీకగా భారతీయ ఆత్మ చందమామలో ప్రతి బింబించే విధంగా చందమామ ఎదగాలని, భావితరాలవారు చంద్రమండలం పైన ఆవాసాలే ర్పరచుకొని అక్కడ కూడా చందమామను చదవాలని నా ఆకాంక్ష.

– ప్రతాపగిరి రామకృష్ణబాబు, వన్నయపాలెం, గుంటూరుజిల్లా. (ఆం.ప్ర)

వన్నె తగ్గకుండా చందమామ కథలు నేటికీ ఆబాలగోపాలాన్ని అలరిస్తున్నాయి. మా పిల్లలు ఇంగ్లీషు మీడియంలో చదువుతున్నా చందమామ ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తున్నారు. కథలకు తగినట్టుగా బొమ్మలు రావడం చందమామ ప్రత్యేకత.

–రాళ్ళబండి రాజన్న, శ్రీరాంపూర్ కాలనీ, ఆదిలాబాద్ జిల్లా – 504 303 ( ఆం.ప్ర)

గత 20 సంవత్సరాలుగా చందమామను చదువుతున్నాను. కాని నేటి చందమామలో కథలకు బదులు వివిధ సంస్కృతుల శీర్షికలు ఎక్కువయ్యాయి. చందమామలో వినోదాత్మక, విజ్ఞాన, నీతికథలనే ఆశిస్తున్నాం. కథలకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వండి

–ఆదిత్య, నరసారావుపేట.( ఆం.ప్ర)

చందమామలో కథల ప్రాధాన్యత తగ్గిందని ఇప్పటికీ కొందరు పాఠకులు ఆరోపించడం విస్మయం కలిగిస్తున్నది. గత సంవత్సరం మొదటి 5 నెలల కాలాన్ని మినహాయిస్తే '90 లలో కంటే ఇప్పుడే ఎక్కువ సంఖ్యలో కథలు వస్తున్నాయి. ఇకపోతే భారతీయ సాంస్కృతిక వైభవానికీ, వైవిధ్యానికీ అద్దం పడుతూ విభిన్న జీవనశైలుల్ని పరిచయం చేసే 'చందమామ'లోని శీర్షికలను మార్కెట్లో దొరికే జనరల్ నాలెడ్జ్ పుస్తకాలతో పోల్చడం అన్యాయం.

– జి.త్రివిక్రమ్, పడిగెలపల్లి, కడప జిల్లా–516 003.

విఘ్నేశ్వరుడు, మాయాసరోవరం వంటి సీరియల్స్ తిరిగి ప్రచురిస్తున్నందుకు ధన్యవాదాలు. దయచేసి వాటిని కుదించకండి. యథాతథంగా, పాత చిత్రాలు కట్‌చేయకుండా ప్రచురించండి. బొమ్మల కలరింగ్ విషయంలోనూ శ్రద్ధవహించండి.

– ఒక పాఠకుడు, మచిలీపట్నం.

వేసవి సెలవులు దగ్గరపడుతున్నాయి. చాలామంది పుణ్యక్షేత్రాల దర్శనానికి వెళతారు. పాఠకులు తాము దర్శించిన పుణ్యక్షేత్రాలను గురించి రాసేవిధంగా, "నేను దర్శించిన పుణ్యక్షేత్రం!" అనే శీర్షికను ప్రవేశపెట్టి పాఠకుల వ్యాసాలను ప్రచురిస్తే బావుంటుంది.

– పవన్‌కుమార్, శ్యామలానగర్, గుంటూరు–522 006.



వ్యవస్థాపకులు
బి.నాగిరెడ్డి - చక్రపాణి

# మనకు కావలసింది శాంతి, యుద్ధం కాదు!

ఈనాడు మనం క్లిష్టమైన కాలఘట్టంలో రోజులు గడుపుతున్నాం. సరిహద్దులలో జరిగే కాల్పుల గురించి రోజూ వార్తలు వస్తున్నాయి. యుద్ధానికి కాలుదువ్వుతున్నారనీ, తీవ్రవాదాన్ని పెంచి పోషిస్తున్నారనీ భారత్–పాక్ నాయకులు పరస్పర నిందారోపణలు చేసుకుంటున్నారు. ఉద్రిక్తత పెరుగుతున్నది!

యుద్ధం వినాశాన్నీ, విషాదాలనూ మాత్రమే తీసుకురాగలదని మనం మరిచి పోకూడదు. ఇప్పటికే సరిహద్దులోని కొన్ని గ్రామాలకు గ్రామాలే ఖాళీ అవుతున్నాయని వార్తలు వస్తున్నాయి. జీవితమంతా కష్టించి కట్టుకున్న ఇళ్ళనూ; చెమటోడ్చి పండించి కోతకు సిద్ధంగా ఉన్న పంటనూ వదిలిపెట్టి, ప్రాణాలరచేత పట్టుకుని భార్యాపిల్లలతో పరాయి ప్రాంతాలకు వలసవెళుతున్నవాళ్ళ దుస్థితి ఎంతటి భయానకమైనదో ఒక్కసారి ఊహిస్తే గుండె నీరవుతుంది.

యుద్ధం అంటే మరణం. సైనికుల మరణం; అమాయక ప్రజల మరణం. నిత్యావసరవస్తువుల కొరత. ధరల పెరుగుదల...ఒక్క మాటలో చెప్పాలంటే దుర్భర దుస్థితి!

అందుకే, ఇవాళ మనకు కావలసింది శాంతి; యుద్ధం కాదు. శాంతి అన్నది ఏ ఆకాశం నుంచో అమాంతం మన ముందుకు ఉరకదు. కలతల మూలకారణాలను తొలగిస్తేనే శాంతి సిద్ధిస్తుందని జవహర్‌లాల్ నెహ్రూ చెప్పారు.

రెండుదేశాలమధ్య నెలకొన్న కలతలను తొలగించాలంటే – ఉభయదేశాలూ గత యాభై యేళ్ళుగా పెంచుకున్న అనుమాన, ద్వేషాలను కూకటివేళ్ళతో పెకలించి వేయాలి. ఉభయదేశాలలో ఉన్న, సక్రమంగా ఆలోచించే ప్రతి మనిషితోనూ కలిసి – ఈనెలలో జన్మదినోత్సవం జరుపుకుంటూన్న చందమామ, శాంతిని పరిరక్షించుకోవాలని కోరుకుంటున్నది!

సంపాదకుడు : విశ్వం
Visit us at : http://www.chandamama.org





# సుకర్ముడి కల

సుకర్ముడు అనే సాధువు, తన శిష్యుడు కౌశల్యుడితో కలిసి దేశసంచారం చేస్తున్నాడు. ఒకనాడు వాళ్ళు చీకటిపడే వేళకు, ఒక చిన్న గ్రామం చేరుకుని, ఒక గృహస్థు ఇంటి అరుగు మీద విశ్రమించారు.

ఆ ఇల్లు బసవయ్య అనే రైతుది. వేకువ జామున ఆ ఇంటికి నాగయ్య అనే రైతు నాగలి ఒకటి ఎత్తుకు వచ్చి, ఇంటిముందు గోడవారగా ఆనించి పెట్టాడు. తర్వాత తలుపు తట్టి బసవయ్యను నిద్రలేపి, నాగలితో తనకు పని బాగా జరిగిందనీ, తనకు నాగలి ఇచ్చినందుకు కృతజ్ఞతలు చెప్పుకుని వెళ్ళిపోయాడు.

అంతలో పూర్తిగా తెల్లవారింది. బసవయ్య బయటికి వచ్చి నాగలికేసి చూశాడు. నాగలికున్న ఇనుపకర్రు మొన పూర్తిగా విరిగిపోయి వున్నది. బసవయ్య వెంటనే భార్యను పిలిచి, ''చూశావా, నాగయ్య నక్కజిత్తులు! నాగలి కర్రు విరగ్గొట్టి, ఏమీ ఎరగనట్టు నంగనాచిలాగా తెచ్చి, ఇక్కడ పెట్టి వెళ్ళిపోయాడు. ఉండు, వాడిపని చెబుతాను!'' అంటూ పట్టరానికోపంతో పలుగొకటి తీసుకొని, నాలుగిళ్ళ అవతల వున్న నాగయ్య ఇంటికి వెళ్ళి, అతని ఇంటి ముందున్న విత్తనం వేసే పనిముట్టును ఒకే దెబ్బతో విరగ్గొట్టాడు.

అది చూసిన నాగయ్య పట్టరాని కోపంతో లోపలికి వెళ్ళి బాణాకర్రతో తిరిగివచ్చి, ''ఒరే నీకేం పోయేకాలం వచ్చింది!'' అంటూ బసవయ్య తలమీద ఒక దెబ్బ వేశాడు.

ఆ వెంటనే బసవయ్య ఒళ్ళు మరిచిపోయి, పలుగుతో నాగయ్య తలమీద కొట్టాడు. నాగయ్య రెండు చేతులతో తల గట్టిగా పట్టుకుని కూలబడిపోయాడు. దెబ్బ గట్టిగా తగలడంతో రక్తం బయటికి వచ్చింది.

రక్తం కళ్ళచూడగానే బసవయ్యకు కాళ్ళూ, చేతులూ చల్లబడిపోయినై. ఒక్క పరుగున ఇల్లు చేరుకుని తలుపు మూసుకున్నాడు. క్షణాలమీద నాగయ్య ఇద్దరు తమ్ముళ్ళకూ విషయం తెలిసింది. వాళ్ళు కొడవలీ, గొడ్డలీ

దాసరి వెంకటరమణ

తీసుకుని ఆవేశంతో బసవయ్య ఇంటిమీదికి వచ్చారు.

ఇది విన్న బసవయ్య మేనమామా, బావ మరిదీ చేతికందిన ఆయుధం తీసుకుని అక్కడికి వచ్చారు. ఈ గొడవ చూడడానికి ఊళ్ళో జనం ఒక్కొక్కరూ అక్కడికి చేరసాగారు.

నాగయ్య తమ్ముళ్ళకూ, బసవయ్య బంధువులకూ బాగా వాగ్వివాదం జరిగి, ఒకర్నొకరు కొట్టుకోవడానికి సిద్ధపడ్డారు.

జరుగుతున్నదంతా గమనిస్తున్న సుకర్ముడు పరిస్థితి చేయిదాటిపోతున్నదని పసికట్టి, అరుగుమీది నుంచి లేచి వాళ్ళ మధ్యకు వచ్చాడు. హఠాత్తుగా తమ మధ్యకు వచ్చిన సాధువును చూసి అందరూ ఆశ్చర్యపోయారు. సుకర్ముడు, నాగయ్య తమ్ముళ్ళనూ, బసవయ్య బంధువులనూ శాంతపరచి, తలుపు తట్టి మెల్లగా నచ్చజెప్పి, బసవయ్యను బయటకు రప్పించాడు. అతడిని తనవెంట నాగయ్య దగ్గరకు తీసుకువెళ్ళాడు.

ఆ సరికి నాగయ్య కాస్త తేరుకున్నాడు. వైద్యుడు గాయం కడిగి తలకు కట్టుకట్టాడు.

సుకర్ముడు, బసవయ్యను, నాగయ్య పక్కన కూర్చోబెట్టి, అక్కడ చేరినవాళ్ళందరికీ వినపడేలా ఇలా అన్నాడు: ''అయ్యా, మేము ఈ ఊరుమీదుగా వెళుతున్న బాటసారులం. రాత్రి బసవయ్యగారి ఇంటి అరుగుమీద తలదాచుకున్నాం. మందంగా వీస్తున్న చలిగాలికి బాగా నిద్రపట్టింది. ఆ నిద్రలో ఒక కల వచ్చింది! ఆ కలలో నాగయ్య నాగలి తీసుకొచ్చి, బసవయ్యకు అప్పగించి వెళ్ళిపోవడంకన్పించింది. తర్వాత బసవయ్య నాగలిని పరీక్షగా చూడగా దాని కర్ర విరిగిపోయి



వుంది. వెంటనే నాగయ్యను పిలిచి కర్రు ఎలా విరిగిందని అడిగాడు. నాగయ్య జరిగినదానికి చాలా నొచ్చుకుంటూ క్షమాపణ చెప్పుకుని, తాను వెంటనే దానిని సరిచేసి తెస్తానని, నాగ లిని ఎత్తుకుని కమ్మరివద్దకు బయల్దేరాడు. అంతలో చుట్టూ గొడవ గొడవగా ఉండడంతో కల చెదిరింది!'' అన్నాడు.

అది వినగానే బసవయ్యకు తాను చేసిన తప్పేమిటో మెల్లగా అర్థంకాసాగింది. అంతలో నాగయ్య భార్య తన భర్తతో, ''మీకు చెప్పడం మర్చిపోయానండి. నిన్న చీకటిపడేవేళ పని వాడు దుడ్డుకర్రతో గేదెను కొట్టబోతే, అది తప్పించుకుంది. కర్ర నాగలికి తగిలి కర్రు విరిగింది,'' అన్నది.

నాగయ్య నొచ్చుకుంటూ, ''అయ్యో, ఎంతపని జరిగింది! నన్ను మన్నించండి, బసవయ్యా, నాగలిని సరిగా చూడకుండా తీసుకొచ్చి మీ ఇంటి గోడకు ఆనించడం, నాదే తప్పు,''అన్నాడు.

బసవయ్య కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ, నాగయ్య చేతులు పట్టుకుని, ''మన్నించవల సింది నేనుకాదు నాగయ్యా, నువ్వే! నాగలి విరిగిందన్న సంగతి నీ దృష్టికి తీసుకురావల సిందిపోయి, తొందరపాటుగా బంగారంలాంటి నీ విత్తనం గొర్రును నాశనం చేశాను,''అన్నాడు.

''కనీసం అప్పుడైనా, నీకోపానికికారణంకను క్కోకపోవడం నాదే తప్పు'' అన్నాడు నాగయ్య.

సుకర్ముడు, బసవయ్యనూ, నాగయ్యనూ ఓదార్చి, ''చూశారా! ఆవేశం మనిషిని అంధుణ్ణి చేస్తుంది. తొందరపడకుండా శాంతంగా ఆలో చించినప్పుడు, మెల్లగా కళ్ళు తెరిపిపడి ఏది సరైన మార్గమో తెలిస్తుంది. మానవజన్మ పరమోత్కృష్టమైనది; పరిమితమైనది. ఈ కాస్త కాలంలోనూ మనిషి సామరస్యంగా సంతో షంగా జీవించాలి. రక్తపాతానికి దారితీసే ఎటువంటి గడ్డు సమస్యనైనా సహేతుకమైన సంప్రదింపులద్వారా పరిష్కరించుకోవచ్చు. నిజానికి నాకెటువంటి కలా రాలేదు! దుర దృష్టవశాత్తూ మీ మధ్య జరిగిన ఈ సంఘటన తర్వాత-ఇలా మలుపుతిరిగి వుంటే బావుం డేదని ఊహించి చెప్పాను!'' అన్నాడు.

బసవయ్యా, నాగయ్యా, సుకర్ముడికి తమ కృతజ్ఞతలు చెప్పుకున్నారు. సుకర్ముడు, శిష్యుడితో పాటు ఆవేళ వారి ఆతిథ్యం స్వీక రించి, మర్నాడు యథాప్రకారం అక్కడి నుంచి బయల్దేరాడు.





# మాయాసరోవరం

## 6

[చరకాచారి దగ్గరకు వచ్చిన మొసలి ఆకారంవాణ్ణి నేర్పుగా పట్టుకుని, అతడి వాహనం జలగ్రహం మీద ఎక్కి జయశీలుడూ, సిద్ధసాధకుడూ హిరణ్యపురంకేసి బయలుదేరారు. దారిలో ఒకచెట్టుమీద నుంచి బోయభీమన్న, మొసలి ఆకారంవాణ్ణి బాణంతో కొట్టాడు. జలగ్రహం పోయి భీమన్న వున్న చెట్టును కూకటివేళ్ళతో పెకలించింది. — తరవాత]

బోయభీమన్న ప్రాణభయంతో కేకలు పెడుతూనే చెట్టుతోపాటు కిందపడ్డాడు. జయశీలుడు, మకరకేతు భుజం పట్టుకుని గట్టిగా కుదిలిస్తూ, "ఒరే, మొసలితొడుగు దుష్టుడా! నా అనుమతి లేకుండా జలగ్రహాన్ని చెట్టును పెళ్ళగించేందుకు ఎందుకు ఉసి కొల్పావు?" అన్నాడు కోపంగా.

మకరకేతు బాధతో ఒకసారి మూలిగి, "జయశీలా, నేనా బోయవాణ్ణినేల పడగొట్టిం చకపోతే, ఆ దుర్మార్గుడు ఈపాటికి మరో బాణాణ్ణి వదిలి నా గుండెల్ని చీల్చేవాడు," అన్నాడు.

ఈ లోపల సిద్ధసాధకుడు, జలగ్రహం మీది నుంచి కిందికి దూకి, చెట్టుకొమ్మల్లో చిక్కుకుని నానా అవస్థా పడుతున్న బోయ భీమన్నను బయటికి లాగి, "ఒరే, బోయ వెధవా! కాళ్ళూ, చేతులూ ఏమైనా విరిగి నయ్యేమో చూసుకో," అన్నాడు.

భీమన్న ఎగిరి గంతేసి, "దయ్యాలపోతు దొరా! నాకేం దెబ్బలు తగల్లేదు; అలా చెట్టు



మీది నుంచి గరుడపక్షి కిందికి వాలినట్టు వాలాను. ఈ సారి నా బాణం, ఆ పిశాచి ఏనుగు మీద వున్నవాడి గుండెల్లో దిగబోతున్నది!'' అంటూ ఉత్సాహంతో బాణం ఎక్కుబెట్ట బోయాడు.

ఆ మరుక్షణం జయశీలుడు, జలగ్రహం మీది నుంచి కిందికి దూకి, బోయభీమన్న మెడ పట్టుకుని, ''ఒరే, నీ బాణం గురితప్పి, నాకు తగలవచ్చన్న అనుమానం కూడా నీక్క లగలేదా?'' అని అడిగాడు కోపంగా.

''దొరా, నా బాణం గురి తిరుగులేనిది. కావాలంటే ఆ మొసలివేషంగాడి రెండు కను బొమల మధ్య దిగేలా బాణం కొట్టగలను,'' అంటూ భీమన్న విల్లంబు ఎత్తాడు.

జయశీలుడు వెంటనే వాడిచేతిలో వున్న విల్లంబులను గుంజుకుని దూరంగా పార వేశాడు. అప్పుడు అక్కడికి చరకాచారీ, వీర నారాయుడూ వచ్చారు. చరకాచారి, మకరకేతు కేసి చూసి ఆశ్చర్యపోయి, ''ఇదేమిటి? డొక్కలో దిగిన కత్తితోపాటు భుజంలో గుచ్చుకున్న బాణం కూడానా! ఈ మొసలి వేషగాడి రోజులు బావున్నట్టు లేదు,'' అన్నాడు.

''ఛీ, ఇంతమంది మానవమాత్రుల వల్ల అవమానం పాలై, చావుదెబ్బలు తిని ఇంకా బతికి వుండడం కన్న చావు మేలు! ఏదీ, నా వాడి శూలం ఎక్కడ?'' అంటూ మకరకేతు, జలగ్రహం మీద వెతకబోయాడు.

సిద్ధసాధకుడు తన చేతిలో వున్న శూలాన్ని పైకెత్తి, '' ఈ శూలాన్ని నా సొంతం చేసుకుని ఎంతసేపాయె!'' అన్నాడు.

తర్వాత, జయశీలుడూ, సిద్ధసాధకుడూ జలగ్రహం మీదికి పోయి, మకరకేతుతో, ''కేతూ! నీకొచ్చిన ప్రాణభయం ఏమీలేదు. నిన్ను దాపులనే వున్న గ్రామానికి తీసుకు పోయి, అక్కడ చికిత్స చేయించి గాయాలు మానినతర్వాతే, నిన్ను హిరణ్యపుర రాజుగారి దగ్గరకు తీసుకుపోతాం,'' అన్నాడు.

మకరకేతు చేతులు రెండూ ఎత్తి, ''అంతా, మాయాసరోవరేశ్వరుడి దయ! దారిలో మరొక బోయవెధవ, ఈసారి కుడిభుజంలో బాణం కొట్టకుండా మాత్రం నన్ను కాపాడండి, అంతే చాలు!'' అన్నాడు.

''నీకలాంటి భయం ఏమీ వద్దు. నీకు అభయం ఇస్తున్నాం. ఊ, జలగ్రహాన్ని అది లించు,'' అన్నాడు జయశీలుడు.

జలగ్రహం కదిలి కొంతదూరం పోయే సరికి, హఠాత్తుగా ఎదురుగా వున్న చెట్ల గుంపుల్లో నుంచి డప్పుల మోతలూ, ఈలలూ వినిపించినై. ఆ మరుక్షణం బోయవాళ్ళ

దయ్యాలపోతూ, వాడి పక్కన డప్పులూ, విల్లంబులూ పట్టుకున్న పదీ పన్నెండు మంది బోయవాళ్ళూ చెట్ల చాటునుంచి బయటికి వచ్చారు.

బోయ దయ్యాలపోతు చిందులు తొక్కుతూ, ''బలి!బలి! నేను మహంకాళిని. మొసలిమనిషి గొంతు కొరికి పుక్కిటపట్టిన రక్తంతో, నా కాళ్ళకు పారాణి పెట్టాలి. అలా చేయకపోతే లోకంలో వున్న బోయకులాన్నే విరుచుకు తింటాను!'' అని అరుస్తున్నాడు.

ఇది చూస్తూనే జలగ్రహం వెనక నడుస్తున్న బోయభీమన్న, ''తల్లీ మాంకాళీ!'' అంటూ ఒక కేకపెట్టి, సిద్ధసాధకుడితో, ''అయ్యా, రాజుగారి దయ్యాలపోతు దొరా! మా గణాచారిపోతుగాణ్ణి, మా కులదేవత మాంకాళి ఆవేశించింది. ఆ తల్లి, ఈ మొసలి ఆకారంగాడి నెత్తురు కావాలంటున్నది. వాణ్ణి దయ్యపుటేనుగు మీది నుంచి కిందికి తోసెయ్యండి. తర్వాత పని, మా గణాచారే చూస్తాడు!'' అన్నాడు.

వాళ్ళ దయ్యాలపోతును చూసి, భీమన్నకూ గణం పూనుతున్నదని గ్రహించిన జయశీలుడు, మకరకేతు చెవిలో ఏదో మెల్లిగా చెప్పాడు.

వెంటనే మకరకేతు, ''జలగ్రహా! ఈ అడవి అనాగరిక వెధవను తొండానికి చుట్టి పైకెత్తు!'' అంటూ దాని వీపు చరిచాడు.

జలగ్రహం చప్పున తొండంతో బోయ భీమన్న నడుం వడిసి పట్టుకుని పైకెత్తింది. భీమన్న కాళ్ళూ, చేతులూ కొట్టుకుంటూ, ''జయశీలప్రభో! బోయ మాంకాళి, మొసలి ముఖంవాడి నెత్తురు కావాలంటూంటే, మీరు



కాదని ఆ మహమ్మాతకు ఆగ్రహం తెప్పిస్తున్నారు,'' అంటూ వణికిపోసాగాడు.

జయశీలుడు, జలగ్రహం మీది నుంచి ముందుకు వంగి, కత్తిని భీమన్న వెన్నుమీ దానించి, ''మీవాళ్ళందర్నీ తిరిగి గూడేనికి పొమ్మని చెప్పు!'' అన్నాడు.

భీమన్న భయంతో గిలగిల్లాడుతూ, ''ప్రభో, నన్ను కత్తితో పొడవకండి. మాంకాళి కోరలకన్న మీ కత్తి వాడిగా వున్నట్టుంది,'' అన్నాడు.

''ఒరే, భీమన్నా! నే చెప్పినదేమిటి?'' అంటూ జయశీలుడు, భీమన్న వెన్నుమీద ఆనించిన కత్తిని కాస్త గట్టిగా నొక్కాడు.

వెంటనే భీమన్న, జలగ్రహం మీదికి వస్తున్న బోయవాళ్ళతో, ''ఒరే, గండుమావా! బక్కచిన్నోడా, బాణాలు వదలకండి. దయ్యాల పోతయ్యో, జాగ్రత్త! ఈ మొసలితలవాడు రాజుగారి మనిషి!'' అంటూ కేకపెట్టాడు.



‘‘నా కాళ్ళ పారాణిమాటేవిటి? వాడి రక్తం పారాణిగా పెట్టుకోందే, నేను శాంతించను. నేను కాళిని, బోయమహంకాళిని!’’ అంటూ బోయగణాచారి, జలగ్రహం కేసి రెండడు గులు వేశాడు.

జయశీలుడు, జలగ్రహం మీది నుంచి కిందికి దూకి, గణాచారి జుట్టు పట్టుకుని, ‘‘ఒరే, అబద్ధాల మారిముచ్చూ, ఇప్పుడు నిజం చెప్పు! నిన్నావేశించింది మహంకాళా? విప్ప- ఈతచెట్ల కల్లా?’’ అని అడిగాడు.

‘‘నమ్మితినమ్మా, బోయమహంకాళమ్మా, రక్షించు! రక్షించు!’’ అంటూ గణాచారి పెద్దగా అరిచాడు.

ఆ మరుక్షణం, ‘‘హేయ్, ఆగండి! ఏమిటీ గందరగోళమంతా?’’ అంటూ పది మంది ఆశ్వికులు ఈటెలు ఝుళిపిస్తూ వేగంగా వచ్చి, అందరినీ చుట్టుముట్టారు.

తమను చుట్టుముట్టిన ఆశ్వికులు, రాజుగారి సైన్యంలోని వాళ్ళని జయశీలుడు గుర్తించాడు. అతడు వాళ్ళతో, ‘‘అదుగో, ఆ వింత ఏనుగుమీద మొసలి ఆకారంలో కనిపిస్తున్నవాడు, రాజుగారి బందీ. పారిపో కుండా చూడండి,’’ అన్నాడు.

ఆశ్వికుల నాయకుడు, మకరకేతునూ, జలగ్రహాన్నీ పరీక్షగా చూసి, ఆశ్చర్యంతో ఒక క్షణకాలం స్తంభించిపోయి, ‘‘వీడెవడు; రాక్షసుడా, ఏదైనా దుష్ట పిశాచమా?’’ అని అడిగాడు.

‘‘అయ్యా, వాడు ఆ రెండూ కాదు. అట్లని వాడు ఫలానా జాతివాడని తేల్చి చెప్పడం కూడా సాధ్యపడదు,’’ అన్నాడు జయశీలుడు.

ఇంతలో సిద్ధసాధకుడు, బోయగణా చారిని పట్టుకుని కొంతదూరం తీసుకు పోయి, విల్లంబులు ఎత్తిన బోయవాళ్ళతో, ‘‘వీడు నిజమైన కాళీభక్తుడు కాదు; ఒట్టి కపటి! మీరు బాణాలను వీడి గుండెల్లో దూసుకుపోయేలా కొట్టండి!’’ అని చెప్పాడు.

అది వింటూనే బోయగణాచారి చావు భయంతో గడగడలాడిపోతూ, సమీపానికి వచ్చిన జయశీలుడితో, ‘‘మహాప్రభో! నన్ను మా బోయ అమాయక వెధవల నుంచి రక్షిం చండి. బాణం దెబ్బలు, కత్తి దెబ్బలకన్న మహాబాధ కలిగిస్తవి,’’ అన్నాడు.

‘‘చచ్చేందుకు బాణం దెబ్బలయితేనేం, కత్తిపోటు అయితేనేం! ఇక అట్టే వాగక కదలా మెదలక నిలబడు,’’ అన్నాడు సిద్ధసాధకుడు కోపంగా.

బోయవాళ్ళు బాణాలు గురి చెయ్యబో యేంతలో, జయశీలుడు ఆగమని వాళ్ళను



హెచ్చరించి, "సాధకా, నువ్వు చెయ్యబోయే ఈ మతిమాలిన పనేమిటి? నువ్వేమైనా రాజువా మరణశిక్షలు విధించడానికి?" అన్నాడు కోపంగా.

అప్పటివరకూ జరుగుతున్నదంతా ఆశ్చ ర్యపోతూ చూస్తున్న అశ్వికభటుల నాయ కుడు, జయశీలుడితో, "అయ్యా, మీరేనా జయశీలుడు? మంత్రిగారు ఈ దాపులనే వున్న కొండచెరువు పల్లెగ్రామంలో విడిది చేశారు. మీ కోసం వెతుకుతూ అరణ్యానికి వచ్చాం," అన్నాడు.

"ఆహా, అశ్వికభట నాయకా, చాలా భేషైన పనిచేశావు. నేనూ-అంటే సిద్ధసాధకుణ్ణి- ఈ జయశీలుడూ కలిసి యువరాజునూ, యువరాణినీ అపహరించుకుపోయిన ఈ వింత ఆకారంవాణ్ణి, అరణ్యమంతా గాలించి పట్టుకున్నాం. వాడే వీడు!" అంటూ మొసలి ఆకారంవాణ్ణి చేయెత్తి చూపించాడు.

అశ్వికభటుల నాయకుడు, మకరకేతు కేసి పరీక్షగా చూస్తూ, "వీడు వింతకాదు, భయోత్పాతం కలిగించేలా వున్నాడు. డొక్కలో, భుజంమీదా కత్తినీ, బాణాన్నీ ఆభరణంలా ధరించడం మాత్రం, నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నది!" అన్నాడు.

"అవి ఆభరణాలు కావు, వాడి ప్రాణం తీయనున్న యములాళ్ళు!" అన్నాడు వీరనారాయుడు, జలగ్రహం చాటునుంచి ముందుకు వస్తూ.

జయశీలుడికి ఇక అక్కడ కాలయాపన చేయటం మంచిది కాదనిపించింది. అతడు మకరకేతుతో, "కేతూ, ఇక నీకొచ్చిన ప్రాణ భయం ఏమీ లేదు. కనకాక్షరాజుగారే స్వయంగా, తన మంత్రిని పంపారు. ఇక బయల్దేరుదాం," అన్నాడు.

మకరకేతు పెద్దగా ఒకసారి మూలిగి, "భుజంలో గుచ్చుకున్న బాణం చాలా బాధ పెడుతున్నది. దాన్ని కొట్టిన బోయ దుర్మా ర్గుడు జలగ్రహం తొండం మీదే ప్రాణాలు వదిలినట్టున్నది!" అన్నాడు.

చరకాచారి, బోయభీమన్న నాడి పరీక్షించి చూసి, "వీడింకా బతికే వున్నాడు," అన్నాడు.

చరకాచారి మాట ముగించే లోపలే సిద్ధ సాధకుడు, బోయభీమన్న చెవిలో పెద్ద గొంతుతో, "ఒరే, భీమన్నా ఇక నిద్రలే! నువ్వు కొట్టిన అడవికోడిని, మీ గణాచారి దొంగి లించి పారిపోతున్నాడు," అన్నాడు.

ఆ వెంటనే భీమన్న కళ్ళు తెరిచి, జల గ్రహం తొండం మీదినుంచి కిందపడి లేచి, అంతదూరంలో నిలబడి వున్న తన జాతి



కుడు పెద్దగా నవ్వాడు. వీటన్నిటినీ వింతగా చూస్తున్న ఆశ్వికుల నాయకుడు, జయశీలుడితో, ''అయ్యా, ఇక బయల్దేరమంటారా?'' అన్నాడు.

''అలాగే!'' అని జయశీలుడు, చరకాచారినీ, వీరనారాయుణ్ణీ దగ్గరకు పిలిచి, ''ఇక మీరు ముందుండి దారి తీయండి. మంత్రిగారు మీ గ్రామం దాపులనే విడిదిదిగారట!'' అన్నాడు.

''మంత్రిగారి రాక మా గ్రామానికి లోకప్రసిద్ధి కలిగిస్తుంది. ఈ మొసలి తొడుగు కట్టినవాడికి, ఆ శ్రీ మంత్రిగారి సమక్షంలోనే శస్త్రం చేసి, నేనూ వీరనారాయుడూ, భేష్ అనిపించుకుంటాం,''అన్నాడు చరకాచారి.

''ఔనౌను, చరకాచారిగారూ! ఆ విధంగా మనకు కనకాక్ష మహారాజుగారి కొలువులో వైద్యాచార్య పదవులు లభించే అవకాశం వుంది, ఏమంటారు?''అన్నాడు వీరనారాయుడు ఆశ్చర్య సంభ్రమాలతో.

''ఆచార్య పదవులేమోగాని, శస్త్రం చేసి ఈ మకరకేతును ప్రాణాపాయం నుంచి కాపాడలేకపోతే, మంత్రిగారే మిమ్మల్నిద్దరినీ, దగ్గర్లో వున్న చెరువుగట్టునే తల నరికించేస్తారు,'' అన్నాడు జయశీలుడు.

అది విన్న సిద్ధసాధకుడు ఆవేశపడిపోతూ, ''ఆ పని మంత్రిగారు నాకు ఒప్పచెప్పితే, వీళ్ళిద్దర్నీ సమంత్రకంగా మహాకాలుడికి బలిపెడతాను. అందువల్ల, మనకే కాక, లోకానిక్కూడా ఎంతో మేలు జరుగుతుంది,'' అన్నాడు.

సాధకుడి మాటలకు జయశీలుడు చిన్నగా నవ్వి, ''ఇక మాటలు కట్టిపెట్టి కదలండి,'' అన్నాడు.

వాళ్ళకేసీ, వాళ్ళ ముందు భయంతో వణికిపోతున్న దయ్యాలపోతు గణాచారి కేసీ చూసి, దాపుల వున్న ఒక ఆశ్వికుడి చేతిలోంచి చప్పున ఈటె లాక్కుని, ''నా కోడి ఎక్కడ? ఒరే, గణాచారీ దాన్ని ఎక్కడ దాచావు. ఆకలి! ఆకలి!'' అంటూ ఈటె ఎత్తి గణాచారికేసి ఉరికాడు.

గణాచారి ఒక చావుకేక పెట్టి, ''మనవాణ్ణి కుక్కుట పిశాచం పట్టింది. దానికి మార్జాల మంత్రం వేస్తేగాని వదలదు. ముందు వాడి ఈటె దెబ్బను తప్పుకోవాలి. పరిగెత్తండి!'' అంటూ వెనుదిరిగి పారిపోసాగాడు. వాడి వెంట మిగతా బోయవాళ్ళు కూడా పరుగు ప్రారంభించారు. భీమన్న రౌద్రంగా అరుస్తూ ఈటె ఎత్తి పట్టుకుని, వాళ్ళ వెంటపడ్డాడు.

''బతికిపోయాం, జయశీలా! ఈ బోయవాళ్ళ శని విరగడయింది,'' అంటూ సిద్ధసాధ

ఒక అరగంట కాలం గడిచే లోపలే అందరూ కొండ చెరువుగట్టున వున్న మంత్రి గారి గుడారాన్ని సమీపించారు. మంత్రి ధర్మమిత్రుడు అందరికేసీ ఓమారు చూసి, జయశీలుడితో సాదరంగా, "రాజుగారి పిల్లలను అపహరించినవాణ్ణి పట్టినందుకు నిన్ను అభినందిస్తున్నాను. ఆ దుర్మార్గుడు వాళ్ళను ఎక్కడ దాచాడు?" అని అడిగాడు.

జయశీలుడు, మంత్రికి జరిగినదంతా వివరంగా చెప్పి, "మంత్రివర్యా, ఈ మకర కేతుకు ముందు శస్త్రం చేసి, శరీరం నుంచి కత్తినీ, బాణాన్నీ బయటికి లాగి, గాయాలు మానిన తర్వాత ప్రశ్నించడం బావుంటుంది," అన్నాడు.

"అలాగే చేద్దాం. అప్పుడు నిజం చెప్పక పోతే ఈ మొసలి ముచ్చును ఏనుగులచేత తొక్కించి మరీ చంపిస్తాను," అన్నాడు మంత్రి ధర్మమిత్రుడు.

ఈ సంభాషణ అంతా వింటున్న మకరకేతు, "జయశీలా, జలగ్రహం నీరు తాగి చాలా రోజులైంది," అని విశాలంగా వున్న చెరువును అన్నివైపులా తల తిప్పి పరీక్షగా చూసి, "దీనిలోకి ఏ కొండ కోనల నుంచో లేక ఏ నదీ పాయనుంచో నీరు ప్రవహి స్తున్నట్టున్నది! సరే, జలగ్రహాన్ని చెరువులో దింపి, దాని దాహం తీర్చుతాను," అన్నాడు.

"అలాగే చెయ్యి. కాని, నేనూ, సాధకుడూ కూడా నీ పక్కనే జలగ్రహం మీద వుంటాం. అలాకాకపోతే, నువ్వు ఏదైనా మోసం చేసే అవకాశం వున్నది," అంటూ జయశీలుడు పోయి జలగ్రహం మీద నిలబడ్డాడు. సిద్ధ సాధకుడు కూడా చప్పున వెళ్ళి అతడి పక్కన నిలబడ్డాడు.

మకరకేతు, జలగ్రహాన్ని అదిలించి చెరు వులోదింపి, దాన్ని బాగా లోపలికి తీసుకుపోయి, "జయశీలా, నాకు చావు ఎలానూ తప్పనట్టు న్నది. అది గాయాలు మానినతర్వాత అయితే నేం, ముందుగా అయితేనేం!" అని ఒక క్షణం ఆగి పెద్ద గొంతుతో, "హా, మాయాసరోవరే శ్వరా!" అంటూ కేక పెట్టి, "జలగ్రహా! నీట మునిగి దారి తియ్యి," అన్నాడు.

మరుక్షణమే జలగ్రహం, జయశీలుడూ, సిద్ధసాధకులతో పాటు చప్పున నీళ్ళలోకి మునిగింది. – (ఇంకావుంది)



# ఏమిటి దాని గొప్ప?

హోడ్జా, అల్సెహిర్ అంగడి వీధిలో వెళుతూండగా, ఒక మనిషి, "కేవలం యాభై అక్సీన్ నాణాలే. అద్భుతమైన పక్షి. రండి బాబూ, రండి. విలక్షణ మైన ఈ పక్షిని యాభై అక్సీనాణాలకే కొనుక్కోండి," అని పిలవడం గమనించాడు.

ఆ అద్భుతమైన పక్షి ఏమిటా అని చూడ డానికి అతడి చుట్టూ జనం మూగి ఉన్నారు.

నజీరుద్దీన్ హోడ్జా కూడా ఆ మనిషి అమ్మ జూపుతూన్న పక్షి ఏమిటో చూద్దామని దగ్గరికి వెళ్ళాడు. అతడి చేతిలో ఒక మామూలు చిలుక ఉంది. సాధారణంగా ఒక కోడి ఐదు నాణాలకే వస్తుంది కదా! మరి, ఈ చిలుక ప్రత్యేకత ఏమిటా అని హోడ్జా ఆశ్చర్యపోయాడు.

"మిత్రమా! యాభైనాణాలకు అమ్మజూపుతూన్న ఆ పక్షి ప్రత్యే కత ఏమిటో చెబుతావా?" అని అడిగాడు అతన్ని.

"బాబూ, ఇది అల్సెహిర్‌లో ఎక్కడ పడితే అక్కడ కనిపించే మామూలు పక్షి కాదు. ఇది చిలుక. చాలా ప్రత్యేకమైనది," అన్నాడు అతడు చిలుక రెక్కలను నిమురుతూ.

"మామూలు పక్షిలాగానే కనిపిస్తోంది. అయినా దాని ప్రత్యేకత ఏమిటి?" అని అడిగాడు హోడ్జా.

"క్షమించాలి! ఈ పక్షి పేరు చిలుక. ఇది మాట్లాడగలదు!" అన్నాడు అతడు.

హోడ్జా మనసులో ఒక ఆలోచన తళుక్కు మన్నది. ఇంటికి తిరిగివెళ్ళి, కోళ్ళ గూట్లో ఉన్న ఒక సీమకోడిని చంకకెత్తుకుని అంగడి వీధికి వచ్చాడు. చిలుకను అమ్మజూపుతూన్న మనిషికి దాపులనే నిలబడి, "రండి బాబూ, రండి. ఈ అద్భుతమైన సీమకోడిని వందనాణాలకే ఇస్తాను," అని గట్టిగా పిలవసాగాడు.

పక్కనున్న చిలుక వ్యాపారి ఉలిక్కిపడ్డాడు. హోడ్జాకేసి తిరిగి, "ఏమిటి నీ కోడికి ఉన్న గొప్పదనం? అది మామూలు సీమకోడే కదా. వంద నాణాలు ఎందుకు అడుగుతున్నావు?" అని అడిగాడు.

"అయితే, నువ్వు నీ చిలుకను యాభై నాణాలకు అమ్మజూపుతున్నావా, లేదా?" అని ఎదురు ప్రశ్న వేశాడు హోడ్జా.

"అవును. నా చిలుక మాట్లాడ



గలదని ముందే చెప్పాను కదా? నీ కోడి కూయ డంతప్ప మరేం చేయగలదు? ఏమిటి దాని గొప్ప?" అన్నాడు అతడు వెటకారంగా.

"ఆహా! నా కోడి ఒక్క కూతవేయడమేనా? ఆలోచించ గలదు కూడా!" అన్నాడు హోడ్జా.

ఇది వింటూనే అక్కడ చేరినవాళ్ళు విరగ బడి నవ్వుతూ ఎవరిదారినవాళ్ళు వెళ్ళిపోయారు.

బేతాళ కథలు

# రాజభక్తి!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదల, పరాక్రమాలు మరెవరికీ సాధ్యంకానివి. ఇందుకు నిన్ను అభినందించకుండా వుండలేకపోతున్నాను. కానీ, వీటితోపాటు నీలాంటి మహావీరుడికి కొంత తర్కసహిత వివేచన లేకపోవడం విచారం కలిగిస్తున్నది. వీరదత్తుడిలాగా సూక్ష్మపరిశీలనాజ్ఞానం లేక, ఇంత అర్ధరాత్రివేళ భీతిగొలిపే ఈ శ్మశానంలో అవస్థలపాలవుతున్నావేమో అన్న శంక కలుగుతున్నది. నీలో వున్న లోపాలను



సరిదిద్దుకునేందుకు గాను, ఆ వీర దత్తుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం కేయూరదేశంలో మహాయోధుడైన వీరదత్తుడనే యువకుడుండేవాడు. అతడు మల్లయుద్ధం, సాముగరిడీల వంటి దేశవాళీ యుద్ధ విద్యలలోనే కాకుండా, విలు విద్య, గదాయుద్ధం, కత్తిసాము వంటి క్షాత్ర విద్యలలో కూడా అపారమైన నైపుణ్యం కనబరిచేవాడు. వీటికి తోడుగా అనేక శాస్త్ర విషయాలలో కూడా అతడికి చెప్పుకోతగ్గ పాండిత్యముండేది.

ఇలా వుండగా—కేయూర రాజ్యపు సైన్యాధ్యక్షుడు అకస్మాత్తుగా మరణించడంతో, ఆ పదవిని చేపట్టగల వీరుడికోసం, రాజధానీ నగరంలో ప్రతిష్ఠాత్మకమైన పోటీ ఒకటి ఏర్పాటు చేయబడింది. ఈ సంగతి తెలుసుకున్న వీరదత్తుడు, ఆ పోటీలో పాల్గొని రాజ్యంలో అత్యుత్తమ పదవులలో ఒకటైన సైన్యాధ్యక్ష పదవిని పొందాలని నిర్ణయించుకున్నాడు. వీరదత్తుడి కోరిక తెలుసుకున్న అతడి తండ్రి, ''నాయనా! రాజుల కొలువు అపాయాలకు నెలవు. ఏమాత్రం పొరబాటు జరిగినా ప్రాణానికే ముప్పు వస్తుంది. పాము పడగ నీడలాంటి జీవితం నీకెందుకు? హాయిగా మనకున్న వ్యవసాయం చూసుకుంటూ సుఖంగా కాలం గడుపు,'' అని హితబోధ చేశాడు.

అందుకు అంగీకరించని వీరదత్తుడు, ''ఎంతో శ్రమించి నేను గడించిన విద్యలకు రాచ కొలువులోనే సార్థకత లభిస్తుంది, నాన్నా!'' అంటూ తండ్రిమాట కాదని, పోటీలో పాల్గొనేందుకు బయలుదేరి రాజధానీ నగరం చేరాడు.

అక్కడ అసంఖ్యాకంగా వచ్చిన వీరులతో పాటు పోటీలో పాల్గొన్న వీరదత్తుడు, పోటీలోని ప్రథమచరణాలైన శారీరక దారుఢ్యం, వ్యాయామ యోగవిద్యాపరిచయం, దేశీయ క్షాత్రవిద్యా నైపుణ్యం వంటి అంశాలలో అవలీలగా విజయం సాధించాడు. అలా అనేక అంచెలుగా జరిగినపోటీలలో తన ప్రతిద్వంద్వులైన అనేకమంది వీరులను గెలిచి ప్రథముడుగా నిలిచాడు.

ఆ తర్వాత జరిగిన ముఖ్యమైన పరీక్షలలో—కేయూరదేశ భౌగోళిక పరిస్థితులు, చుట్టుపక్కల వున్న మిత్ర శత్రు రాజ్యాల బలాబలాలు, యుద్ధ తంత్రాలలో పట్టు విడుపులు; ఇలా అనేక రకాల ప్రశ్నలకు, వీరదత్తుడు తెలివిగా తేలికగా సమాధానాలు చెప్పాడు. ఈ పరీక్షలన్నీ పూర్తయ్యాక వీర

దత్తుడికి, తను ఈ పోటీలో గెలుపొందగల నన్న నమ్మకం బలంగా ఏర్పడింది. అందుకు తగినట్టుగానే, ఆ సాయంత్రమే అతడి వసతి, మామూలు పోటీదారుల సామాన్య వసతి నుంచి అత్యంత భద్రతతో వైభవంగా వున్న పెద్ద భవనానికి మారింది.

ఆ మరుసటిరోజే కేయూరదేశపు మహామంత్రి త్రినాధుడు స్వయంగా వచ్చి వీరదత్తుణ్ణి కలిశాడు. ఆయన ముందుగా అన్ని విద్యలలోనూ వీరదత్తుడి నైపుణ్యాన్ని ప్రశంసించి, ''సైన్యాధ్యక్షపదవికి కావలసిన అన్ని అర్హతలూ నీకున్నాయని భావిస్తున్నాము. అయితే, దేశరక్షణలో అతి కీలకమైన ఈ పదవి నిర్వహించే వ్యక్తికి కేవలం పరాక్రమం, యుద్ధతంత్ర నైపుణ్యం మాత్రం వుంటే చాలదు. అంతకు మించి రాజభక్తి, దేశభక్తి కూడా వుండాలి. దేహదారుఢ్యం, నేర్చిన విద్యలలో ప్రావీణ్యం లాంటి పరీక్షలలో అవి నిరూపితం కావు. కనుక, కాలానుగుణమైన సహజపరీక్ష కోసం నువ్వు కొంతకాలం పాటు వేచివుండక తప్పదు. ఒక ఆరునెలల పాటు రాచకొలువులో ఏ హోదాలేని ఉన్నతోద్యోగిగా, నీకు అప్పగించిన బాధ్యతలను నిర్వర్తించు. త్వరితంగానే నువ్వు సైన్యాధ్యక్ష పదవిని స్వీకరించగలవని ఆశిస్తాను,'' అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత రెండు నెలలపాటు వీరదత్తుడికి ఎలాంటి పనీ అప్పగించబడలేదు. ఒక నాడు అకస్మాత్తుగా త్రినాధుడి నుంచి పిలుపు రావడంతో, వీరదత్తుడు ఆయనను చూడబోయాడు.

త్రినాధుడు, వీరదత్తుణ్ణి సాదరంగా



ఆహ్వానించి, ''వీరదత్తా, మన గూఢచారుల నాయకుడి నుంచి అతిముఖ్యమైన సమాచారం ఒకటి అందింది. మన మహారాజు కేయూరసింహులకు క్రమం తప్పని అలవాటు ఒకటి వుంది. ఆయన ప్రతిరోజూ సాయంత్రం మహారాణితో కలిసి ఉద్యానవనానికి వెళతారు. ఆ సమయం రాజదంపతులకు ఏకాంతం అన్నమాట! వ్యక్తిగత భద్రతా సిబ్బందిని కూడా ఉద్యానంలోకి అనుమతించరు. ఈ సంగతి తెలుసుకున్న శత్రువులు, ఆ సమయంలో మహారాజును హత్య చేయడానికి పథకం వేశారు. ఈరోజు నుంచి సాయంత్రపువేళ నువ్వు, రాజదంపతులకు రక్షణగా ఉద్యానంలో వుండాలి. అయితే, ఆ సంగతి ఎవరికీ తెలియకూడదు. నీ కదలికలు రాజదంపతుల ఏకాంతానికి ఏవిధంగానూ భంగం కలిగించ కూడదు.



అందుకు శిక్ష చాలా తీవ్రంగా వుంటుంది, జాగ్రత్త!'' అని చెప్పాడు.

ఇందుకు అంగీకరించిన వీరదత్తుడు, ఆ రోజు సాయంత్రం నుంచీ ఉద్యానంలో రాజ దంపతులకు రక్షణగా, వారికి తెలియకుండా జాగ్రత్తగా వారిని అనుసరిస్తూ వచ్చాడు. ఇలా నాలుగు రోజులు గడిచాక, ఐదవ రోజు సాయంత్రం హఠాత్తుగా నలుగురు దుండగులు, రాజదంపతులపై దాడి చేయబోయారు. కేయూరసింహుడు, వారిని ప్రతిఘటించే లోపలే, వీరదత్తుడు కత్తి దూసి పెద్దగా హుంకరిస్తూ, వారిమీదికి ఉరికాడు. దుండగులు భయకంపితులై, తలా ఒక దిక్కుగా పారిపోయారు.

వీరదత్తుడు, రాజు కేయూరసింహుడికి నమస్కరించి, రాజదంపతుల రక్షణకై నాలుగు రోజులుగా తాను, వారిని అతి రహస్యంగా అనుసరిస్తున్న సంగతి చెప్పాడు. ఇది వింటూనే రాజు, వీరదత్తుడికేసి తీవ్రంగా ఒకసారి చూసి, చప్పట్లు చరిచి ఉద్యాన ద్వారరక్షకులను పిలిచి, వీరదత్తుణ్ణి బంధింపజేసి, మర్నాటి ఉదయం అతణ్ణి తనవద్దకు విచారణకై తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు.

ఆ రాత్రి వీరదత్తుణ్ణి కారాగారంలో కలిసిన మహామంత్రి జరిగిన దానికి బాధపడి, ''వీరదత్తా! రేపు నీకు మహారాజు విచారణలో కఠినశిక్ష తప్పదు. రాజ కొలువు ఈ విధంగానే ప్రమాద భూయిష్టంగా వుంటుంది. ఏమైనా నీకు కలిగిన ఈ ఆపదకు ఒక విధంగా కారణం నేను. అందువల్ల, నువ్వు తక్షణం కారాగారం నుంచి పారిపోయే అవకాశం కలిగిస్తున్నాను, పారిపో! నేను మహారాజుకు ఏదో విధంగా నచ్చచెప్పుకుంటాను,'' అన్నాడు.

వీరదత్తుడు ఒక్కక్షణం ఆలోచించి, ''మహా

మంత్రివర్యులు,నాకు అప్పగించిన బాధ్యతను సక్రమంగా నిర్వర్తించగలిగాను. రేపు మహారాజు వేయబోయే శిక్ష గురించి నాకేచింతా లేదు, నేనెక్కడికీ పారిపోను. నాపట్ల మీకున్న ఆదరాభిమానాలకు కృతజ్ఞతలు,'' అన్నాడు.

ఆ మాటలు విన్న మంత్రి త్రినాధుడు తనలో తానే నవ్వుకుని, వీరదత్తుడి భుజం తట్టి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, వీరదత్తుడు మహావీరుడు కావచ్చునేమో కానీ, దానితోపాటు మహామూర్ఖుడన్నఅనుమానం కలుగుతున్నది. తండ్రి మాటలు పెడచెవిన పెట్టి, రాజుకొలువులో చేరప్రయత్నించడమే మూర్ఖత్వమైతే, మంత్రి త్రినాధుడి సలహాలనుకూడా పాటించకుండా, కారాగారంలో వుండిపోవాలనుకోవడం మహామూర్ఖత్వం కాదా? తన ప్రాణాలను కాపాడినవాడినే కారాగారంలో బంధించిన మహారాజు చిత్తప్రవృత్తిపై ఏ నమ్మకంతో వీరదత్తుడు రాజు విచారణకు సిద్ధపడుతున్నట్టు? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''వీరదత్తుడు మహావీరుడనే దాంట్లో సందేహానికి తావు లేదు. అతడు మూర్ఖుడనుకోవడం పొరబాటవుతుంది. అటువంటివాడు రాచకొలువులోనే రాణిస్తాడు. అందుకే వీరదత్తుడు సైన్యాధ్యక్షుడిపదవికి పోటీపడ్డాడు. అయితే, మంత్రి త్రినాధుడు చెప్పినట్టు కేవలం పరాక్రమం, యుద్ధతంత్రంలో నేర్పరితనం మాత్రమే, రాజ్య సైన్యాధ్యక్ష పదవికి అంతిమ అర్హతలు కాబోవు. రాజదంపతుల రక్షణకుగాను అతడు ఒంటరిగా నలుగురు దుండగులపై కత్తి దూశాడు. రాజదంపతుల ఏకాంతానికి భంగం కలిగించాడనేది కేవలం నెపం మాత్రమే. ఆ దుండగులూ, వీరదత్తుణ్ణి కారాగారంలో బంధించడం, మర్నాడు విచారణా— ఇదంతా రాజూ, మంత్రీ అతడి రాజభక్తినీ, దేశభక్తినీ పరీక్షించేందుకు కల్పించినవి. మంత్రి, అతడికి కారాగారం నుంచి పారిపోయేందుకు అవకాశం కల్పిస్తానన్నా, వీరద త్తుడు తిరస్కరించడంతో, అతడి రాజభక్తి పూర్తిగా రుజువైంది. అందువల్లనే, మంత్రి నవ్వుకుని, అతడి భుజం తట్టాడు. అంటే—సైన్యాధ్యక్ష పదవికి అవసరమైన అన్ని పరీక్షల్లో వీరదత్తుడు నెగ్గడం జరిగిందన్న మాట!'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం: ఉదయశైలజ మల్లంపల్లి రచన]



మన పూర్వగాథలు: 3

# దధీచి త్యాగం!



దేవదానవులు సుదీర్ఘకాలం అంటే వేలాది సంవత్సరాలు ఒకరిపై ఒకరు యుద్ధం కొనసాగించారు. ఆ యుద్ధాలలో కొన్నిసార్లు దేవతలు విజయం సాధిస్తే, మరికొన్నిసార్లు రాక్షసులు అవలీలగా గెలుపొందేవారు. అయితే మొత్తం మీద లెక్క కడితే రాక్షసులే, దేవతలకన్నా ఎక్కువ యుద్ధాలలో జయించారు. రాక్షసుల పరాక్రమమే అందుకు కారణం.

రాక్షసులలో పలువురు అమిత శక్తిసంపన్నులు; సమర్థులు - శాస్త్ర విద్యలలో, కళలలో ఆరితేరినవాళ్ళు వాళ్ళల్లో అసంఖ్యాకంగా ఉండేవారు. అయితే వాళ్ళల్లో మితి మించిన గర్వం, అహంకారం కూడా ఉండేవి. తమ స్వార్థ ప్రయోజనాల కోసం వాళ్ళు ఎంతటి ఘోర చర్యలకూ, ఘాతుక కృత్యాలకూ వెనుకాడే వారు కాదు. జీవితంలో శమదమాలు, వినయ విధేయతలు, దైవభక్తి మొదలైన ఆదర్శాలను ఏమాత్రం పాటించే వారుకాదు. ఇంకా కొందరయితే, శాంత స్వభావులనూ, సాధువర్తనులనూ ద్వేషించే వారు. సాధు సన్యాసులను హింసించి ఆనందించేవారు. స్వర్గాధిపతులు గనక దేవతలంటే వాళ్ళకు గిట్టదు. అందువల్ల భూలోకంతోపాటు దేవలోకాన్నికూడా వశపరుచుకోవడానికి ప్రయత్నించారు. తరచూ స్వర్గంపై దండెత్తివెళ్ళి ఇంద్రసింహాసనాన్ని ఆక్రమించి దేవేంద్రుణ్ణి తరుమగొట్టేవారు.

అయినా, ఇంద్రుడు, త్రిమూర్తులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరుల సాయంతో ఏదో ఒక ఉపాయంతో మళ్ళీ తన ఇంద్రపదవిని కైవసం చేసుకునేవాడు.

బిందుసార్

ఒకప్పుడు వృత్రాసురుడనే రాక్షసుడు వరగర్వంతో, తన అనుచరులతో కలిసి, స్వర్గం మీద తరచూ విరుచుకుపడి విధ్వంసం సృష్టించసాగాడు. ఆ దుర్మార్గుణ్ణి ఓడించ డానికి ఇంద్రుడు శతథా ప్రయత్నించాడు. కానీ సాధ్య పడలేదు.

వృత్రాసురుడు నిప్పుచేత గాని, నీరుచేత గాని; లోహంతో, కొయ్యతో తయారుచేసిన ఆయుధంతో గాని మరణంలేని వరం పొంద డంవల్ల ఇంద్రుడు, వాణ్ణి ఏమీ చేయలేక పోయాడు!

వృత్రాసురుడి పీడ విరగడకు ఉపాయం ఏమిటా అని ఆలోచిస్తూ, ఇంద్రుడు మును లనూ, దేవతలనూ సంప్రదించాడు. ఎవరూ సరైన సలహా ఇవ్వలేకపోయారు. ఆఖరికి మహావిష్ణువును ఆశ్రయించాడు. ఇంద్ర పదవిని పొందడానికి తగిన తపోబలం సాధిం చిన మునిపుంగవుడు మాత్రమేవృత్రాసురుడి మరణానికి సాయపడగలడని తెలియవచ్చింది. అంత గొప్ప తపస్సు చేసిన ముని ఎవరా అని తీవ్రంగా ఆలోచించాడు ఇంద్రుడు. ఒకే ఒక మునిశ్రేష్ఠుడు గుర్తుకు వచ్చాడు. ఇంద్రపదవిని అధిరోహించడానికి తగిన అర్హతను తపస్సు ద్వారా సాధించిన ఏకైక మునివర్యుడు దధీచి.

ఉరుములు మెరుపులతో భయోత్పా తాలు సృష్టించడం; అప్సరసలను పంపి నాట్య విన్యాసాలద్వారా ముని కఠోర తపస్సుకు భంగం కలిగించడానికి ప్రయత్నించాడు. కాని దధీచి ఏమాత్రం చలించకుండా తన తపస్సును కొనసాగించాడు. అపూర్వ తపో శక్తిని సముపార్జించుకున్నాడు. అయినా, ఆ మహానుభావుణ్ణి సమీపించడానికి ఇంద్రుడికి



ధైర్యం చాలలేదు. ఎందుకంటే - దధీచి ఘోర తపస్సుద్వారా తన ఇంద్రపదవికి ఆపద రావచ్చునన్న భయంతో, ఆయనకు తపోభంగం కలిగించడానికి రకరకాలుగా పయత్నించినవాడు ఇంద్రుడు! అప్పుడు అన్ని అపకారాలు చేసి మరి ఇప్పుడెలా ఆయన సహాయాన్ని అర్థించగలడు?

దేవతలు దధీచి సాయం అర్థించడానికి అవరోధంగా ఉన్నది, ఇంద్రుడి ఇబ్బంది కరమైన పరిస్థితి ఒక్కటేకాదు. దధీచి చేయ వలసిన సాయం కూడా అపూర్వమైనది; ముందెన్నడూ కనీవినీ ఎరుగనిది. వృత్రా సురుణ్ణి హతమార్చాలంటే ఇంద్రుడి వజ్రా యుధం అతీతమైన శక్తి కలదిగా ఉండాలి. దధీచి ముని ఎముకలను తనలో కలిగి ఉంటేనే ఇంద్రుడి వజ్రాయుధానికి అలాంటి అద్భుతమైన శక్తి ప్రాప్తిస్తుంది. అంటే దేవతల

కోసం దధీచి తన ప్రాణాన్ని త్యాగం చెయ్యా లన్నమాట! ఆయన తనువు చాలిస్తేనే, ఆయన అస్థికలు ఇంద్రుడి వజ్రాయుధం లోకి అమర్చడానికి సాధ్యపడుతుంది!

ముని తన ప్రార్థనను మన్నించడని ఇంద్రుడు భావించాడు. ఒకప్పుడు తప స్సుకు భంగం కలిగించి, ఇప్పుడు సాయం అర్థించడానికి మొహమాటపడి ఏం చేయ డానికీ తోచక సతమతమవసాగాడు.

అదే సమయంలో రాక్షసులు మునులపై తమ హింసాకృత్యాలతో విజృంభించారు. వీట న్నిటికీ దూరంగా ఉన్నప్పటికీ, దధీచి రాక్షసుల దుండగాల గురించి విన్నాడు. ఆ రాక్షస నాయ కుడి పీడ విరగడకు ఉన్న ఏకైక తరుణో పాయంకూడా ఆయనకు తెలియవచ్చింది. మరుక్షణమే ఆయన మునులనూ, దేవత లనూ పిలిపించి, యజ్ఞ నిర్వహణకు ఏర్పాట్లు చేయమన్నాడు. యజ్ఞవాటిక సిద్ధంకాగానే ఆయన ధ్యాననిమగ్నుడై దేహత్యాగం చేశాడు.

దేవతలు ఆయన అస్థికలతో, ఇంద్రుడి వజ్రాయుధానికి మరింత శక్తిని సమకూ ర్చారు. ఆ తరవాత వృత్రాసురుడు దండెత్తి వచ్చినప్పుడు ఇంద్రుడు తన వజ్రాయుధం ప్రయోగించి అతణ్ణి వధించాడు.

ఆ విధంగా ఉదాత్తమైన లక్ష్యం కోసం, దేవతల, మానవుల కష్టాలను తొలగించానికి ఆ మహాముని తన ప్రాణాన్నే త్యాగం చేశాడు. గతంలో అపకారం చేసినప్పటికీ ఆయన ఇంద్రుడిపై పగ సాధించలేదు. దేవలోకం లోనూ, భూప్రపంచంలోనూ శాంతి భద్రత లను రక్షించాలంటే ఆ దుష్టరాక్షసుణ్ణి దును మాడక తప్పదన్న విషయం ఆయన గ్రహిం చాడు. తపస్సుతో ఆయన శరీరాన్ని పవిత్రం చేసుకున్నాడు. ఆయన చర్యలో రవ్వంత స్వార్థం కూడా లేదు.అందుకే ఆయన అస్థికలు అంతటి శక్తిమంతం కాగలిగాయి. దధీచి మంచి తనానికీ, మహోన్నత ఔదార్యానికీ మణిదీపంగా వెలుగొందుతున్నాడు!





# రహస్య సన్మానం

కార్తీకుడనే గృహస్థుకు కూర్చుని తిన్నా తర తరాలకు సరిపడ్డ ఆస్తివుంది. ఆయనకు అనుకూలవతి అయిన భార్య, బుద్ధిమంతులూ, సమర్థులూ అయినపిల్లలూ వున్నారు. కార్తీకుడికి ఉన్నట్టుండి, పదిమందిలో పెద్ద పేరు తెచ్చుకోవాలని కోరిక పుట్టింది.

కవిత్వం చెప్పాలనుకున్నాడు. పాటలు పాడాలనుకున్నాడు. మరెన్నో కళలను నేర్చుకోవాలనుకున్నాడు. ఏదీ చేతకా లేదు. భార్య వద్ద తన బాధ వెళ్ళబోసుకుంటే, ఆమె, "కళ నేర్చుకుంటే వచ్చేదికాదు. సహజంగా అబ్బాలి. ఈ రోజుల్లో కళాకారుల్ని సన్మానించేవారు, కళాకారుల కంటే ఎక్కువ పేరు తెచ్చుకుంటున్నారు. కాబట్టి మీరు నెలనెలా ఒకకళాకారుడికి మీ పేరిట సన్మానం చెయ్యండి. మీకు బోలెడు పేరు వస్తుంది," అని సలహా ఇచ్చింది.

ఈ సలహా కార్తీకుడికి నచ్చింది. ముున్ముందుగా సన్మానించడానికి, ఆయన దేశంలో పేరు బడ్డ నటరాజయ్యను కలుసుకుని, తన ఉద్దేశ్యం చెప్పాడు. నటరాజయ్య నృత్య విద్యలో సాక్షాత్తూ ఆ నటరాజస్వామి అపరావతారమేనని అంతా అంటారు.ఆయనకార్తీకుడి ఉద్దేశ్యాన్ని మెచ్చుకుని, "నీ ఆలోచన నాకు నచ్చింది. అయితే నన్ను సన్మానించేటప్పుడు, నా గొప్పతనం అర్థంచేసుకున్నవారు పక్కన వుండాలి. వేదికమీద ఏ కారణంగా నాకు సన్మానంజరుగుతున్నదీ చెప్పగలగాలి," అన్నాడు.

"అయ్యా! మీ పేరు విని మిమ్మల్ని నేను ఎన్నికచేశాను. వారూ వీరూ ఎందుకు? నేనే మిమ్మల్ని సన్మానిస్తాను," అన్నాడు కార్తీకుడు.

ఇందుకు నటరాజయ్య తల అడ్డంగా వూపి, "నీకు నాట్యం గురించి ఏమీ తెలియదు

జొన్నలగడ్డ రామలక్ష్మి



కాబట్టి, నన్ను సన్మానించే అర్హత నీకు లేదు. నాకు గురుస్థానంలో వుండే నాట్యాచార్యుల ద్వారా నాఎన్నికజరగాలి. కళాకారుడికిసన్మానం కంటే కూడా సన్మానానికి తననెవరు ఎన్నికచేశారన్నదే ముఖ్యం. నీవు ముందు సరైన న్యాయ నిర్ణేతలను సంప్రదించు," అన్నాడు.

అప్పుడు కార్తీకుడు నాట్యశాస్త్రంలో గురుస్థానంలో వున్న శంకరయ్యను కలుసుకున్నాడు. ఆయన వెంటనే, "ఏ నిర్ణయమైనా ఒక్కరు తీసుకొనడం తగదు. నేను మరొక ఇద్దరు నాట్యగురువుల పేర్లుచెబుతాను. వారినికూడా సంప్రదించు. అంతా ఒప్పుకుంటే, మేము ముగ్గురం కలిసి, ఈ సంవత్సరానికి ప్రముఖ నర్తకుడెవరో నిర్ణయిస్తాం," అన్నాడు.

ఇందుకు కార్తీకుడు నిరుత్సాహంగా, "అయ్యా! సన్మానం నటరాజయ్యకు జరగాలని నేను నిర్ణయించాను. తమరు నాకు చేయవలసింది మాటసాయం మాత్రమే. శంఖంలో పోస్తేకానీ తీర్థం కాదంటారని, ఆ నిర్ణయం తమకు వదిలిపెట్టాను," అన్నాడు.

"మేము నాట్యగురువులం. మేము నిర్ణయించినవారిని నీవు సన్మానించాలి తప్ప, నీవు నిర్ణయించిన వారిని మేము ఆమోదించం," అన్నాడు శంకరయ్య కాస్త తీవ్ర స్వరంతో.

కార్తీకుడు దిగులుపడి భార్యకీవిషయం చెప్పాడు. ఆమె వెంటనే, "న్యాయనిర్ణేతలు ఎవరో అయితే, పేరు వారికిపోతుంది. సన్మానం చేసేది మీరైనప్పుడు, కళాకారుణ్ణి ఎన్నికచేసే హక్కూ మీకుండాలి!" అన్నది.

భార్య మాటలు కార్తీకుడికి బాగా నచ్చాయి. ఆయన సన్మానించడం కోసం కాళ్ళరిగేలా తిరిగితే, అందుకు అతికష్టంమీద నలుగురు దొరికారు—ఒక కవీ, చిత్రకారుడూ, నృత్యకారుడూ, గాయకుడూ. వీళ్ళందరూ తమ తమ విద్యల్లో చాలా నేలబారు మనుషులు.

"మీ సన్మానంతో మాకు గుర్తింపు రావచ్చునని ఆశ!" అంటూ నలుగురూ ఏక కంఠంతో అన్నారు.

కార్తీకుడు వాళ్ళను తనింటికి తీసుకు వచ్చాడు. ఆయన భార్యాబిడ్డలు, ఈ వచ్చిన కళాకారుల శక్తిసామర్థ్యాలను ఇట్టే గ్రహించగలిగారు. ఇప్పుడేం చేయడమా అని ఆలోచించగా, వాళ్ళకొక ఉపాయం తోచింది. కార్తీకుడికి చెప్పారు. ఆయన చేసేదేమీ లేక సరేనన్నట్టు తల ఊపాడు.

అప్పుడు కార్తీకుడి భార్య, ఆ నలుగురితో, "అయ్యా,మావారికి మొహమాటం ఎక్కువ. ఈ కళాపోషణ ఎక్కడ కీర్తిప్రతిష్ఠలు తెచ్చి పెడుతుందో అని వారి భయం.అందుకని నేను మిమ్మల్ని కోరేదేమంటే—నలుగురి ముందూ

మీకు చేసే సన్మానంలో, మీకిచ్చేవి నూటపద హారు వరహాలు. అదే రహస్యంగా ఎవరికీ తెలి యకుండా సన్మానం చేయించుకుంటే, మీకు వెయ్యిన్నూటపదహారు వరహాలు లభిస్తాయి. ఏది మీకిష్టమో తేల్చుకోండి!'' అన్నది.

వెయ్యిన్నూటపదహార్లనగానే నలుగురికీ ఆశ పుట్టింది. ''సన్మానం అంటే సన్మానమే! అది బహిరంగంగా అయితేనేం, రహస్యంగా అయితేనేం?'' అన్నారు వాళ్ళు.

ఆ తర్వాత కార్తీకుడు, భార్య నుంచి డబ్బు తీసుకుని, ఆ నలుగురికీ వెయ్యిన్నూట పద హార్లు ఇచ్చాడు. వాళ్ళు పరమానందంగా నమస్కరించి వెళ్ళి పోయారు.

ఇది జరిగిన రెండు వారాలకు, ఒక అర్ధ రాత్రిపూట ఎవరో కార్తీకుడి ఇంటి తలుపు తట్టారు. కార్తీకుడు తనే లేచివెళ్ళి తలుపుతీసి చూసి, ఆ వచ్చిన వ్యక్తి నటరాజయ్యకావడంతో ఎంతో ఆశ్చర్యపడ్డాడు.

నటరాజయ్య ఒకసారి గొంతు సవరించు కుని, ''నా నృత్యకళను మెచ్చుకునేవారే కానీ, డబ్బిచ్చి ఆదుకునేవారు బహుతక్కువ. నేని ప్పుడు ఆర్థికంగా చాలా చిక్కుల్లో ఉన్నాను– అయినప్పటికీ, క్షమించ కోర్తాను–అంతగా అర్హతలేనివారి నుంచి సన్మానం పొందే అపకీర్తికి భయపడి అప్పట్లో కాదన్నాను. నువ్వు రహ స్యంగా సన్మానం చేస్తున్నట్టు తెలిసింది. రహ స్యంగా ఉంచగలిగితే, నీనుంచి సన్మానం పొంద డంనాకిష్టమే! ఎందువల్లనంటే, వెయ్యిన్నూట పదహార్లు నాకు చాలా పెద్దమొత్తం,'' అన్నాడు.

అప్పుడు కార్తీకుడు ఆయనకు పాదాభి వందనంచేసి, ''మీ మాటలు నాకు కర్తవ్యబోధ చేశాయి. ఇకమీదట నా పేరుకోసం ఇతరులకు సన్మానాలు చేయాలనుకోను.అవసరంలోవున్న కళాకారులందర్నీ, నాశక్తిమేరకు ఆదుకుం టాను,'' అని చెప్పి, నటరాజయ్యకు అవసర మైనంత డబ్బిచ్చి పంపాడు.



# హాస్యచతురులు: తెనాలి రామలింగడు



శ్రీకృష్ణదేవరాయలు ఒకనాడు విచారంగా ఉండడం గమనించిన మంత్రులు కారణం అడిగారు. "మా తల్లి తన అంతిమ ఘడియల్లో మామిడి పళ్ళు అడిగారు. అది మామిడిపళ్ళ కాలం కాదు గనక, ఇవ్వలేకపోయాను. మామిడిపళ్ళు తినాలన్న కోరిక తీరకుండానే ఆమె మరణించారు. గొప్ప రాజునై ఉండీ కన్నతల్లి చివరి కోరిక తీర్చలేక పోయాను," అన్నాడు రాజు గాఢంగా నిట్టూరుస్తూ.

"విచారించకండి ప్రభూ! ఇప్పటికీ మించిపోయిందేమీ లేదు. రాజమాత మనోభీష్టాన్ని ఇప్పుడు కూడా నెరవేర్చవచ్చు. తమరు ఐదు బంగారు మామిడి ఫలాలను పండితులకు దానం చేసినట్టయితే, స్వర్గంలో ఉన్న రాజమాత కోరిక తీరుతుంది. ఆమెకు ఆత్మశాంతి సిద్ధిస్తుంది!" అన్నారు పండితులు.





రాజు పరమానందం చెందాడు. దానం ఇవ్వడానికి పండితులు నిర్ణయించిన ఒక శుభదినాన రాజు ఐదుగురు పండితులకు అయిదేసి బంగారు మామిడి పళ్ళను దానం చేశాడు. పండితులు వాటిని సంతోషంగా పుచ్చుకుని, రాజును మనసారా దీవించారు.

దీన్నంతా దాపులనే ఉండి గమనించిన తెనాలి రామలింగడు పండితులతో, "మా తల్లికూడా ఒక తీరని కోరికతో చనిపోయింది. వచ్చే అమావాస్యనాడు వచ్చారంటే, నేనూ మీకు దానం చేసి, మాతృఋణం తీర్చుకుంటాను," అన్నాడు.





అమావాస్యనాడు పండితులు రామలింగడి ఇంటికి వచ్చారు. తెనాలి రామలింగడు భక్తితో తల్లికి తర్పణం వదిలాక, ఒక్కొక్క పండితుణ్ణీ విడివిడిగా లోపలికి రమ్మన్నాడు. అలాగే ఒక్కొక్కరుగా వెళ్ళారుగాని, పండితులు తిరిగి వచ్చేప్పుడు చేతిని వస్త్రంతో కప్పుకుని గంభీరంగా కనిపించారు.



వాళ్ళు తిన్నగా వెళ్ళి, రాజును దర్శించి, వాతలతో కాలిన తమ చేతులను చూపి జరిగింది చెప్పి, తెనాలి రామలింగణ్ణి తగిన విధంగా శిక్షించమని మొరపెట్టుకున్నారు.



రాజు భటులను పంపి రామలింగణ్ణి పిలిపించాడు. ఆయన రాగానే, "దానం ఇస్తానని ఆశచూపి, పండితుల చేతులపై వాతలు పెట్టావట! ఎందుకలా చేశావు?" అని అడిగాడు కోపంగా.



"ప్రభువులు మన్నించాలి. మా తల్లి కీళ్ళవాతంతో బాధ పడుతూ, "వాతలు! వాతలు!" అంటూ ప్రాణాలు విడిచింది. ఆమె తీరని కోరికను, ఇవాళ పండితుల ద్వారా తీర్చుకున్నాను. ప్రభువులు చేసిన బంగారు మామిడిపళ్ళ దానంతో స్వర్గంలో ఉన్న రాజమాత అభీష్టం నెరవేరినప్పుడు, నేను చేసిన వాతల దానంతో చనిపోయిన మా తల్లి కోరిక కూడా తీరి, ఆమె ఆత్మ శాంతిస్తుంది కదా!" అన్నాడు రామలింగడు అమాయకంగా. రాజు నవ్వు ఆపుకోలేకపోయాడు.

# మీకు తెలుసా?

నెలనెలా వస్తున్న 'క్విజ్' శీర్షిక ఈనెల నుంచి కొత్తపద్ధతిలో వెలువడుతున్నది. ప్రశ్నలకు సమాధానాలను గుర్తించి విడిగా రాసి ఉంచుకుని వచ్చే సంచికలో వెలువడే సమాధానాలతో సరిచూసుకోండి.

1. కింద కనబరచిన నదులలో ఒకటి సాలేరి, ప్రాణహిత, ఇంద్రావతి ఉపనదులను కలిగి ఉన్నది. ఆ నది ఏదో మీకు తెలుసా?
   ఎ. కృష్ణ బి. గోదావరి సి. కావేరి డి. శబర్మతి
2. పంజాబ్, హర్యానా రాష్ట్రాలు ఉమ్మడి రాజధానిని కలిగి ఉన్నాయి. చండీఘడ్‌కు ముందు, పంజాబ్ రాజధాని ఏది?
   ఎ. జలంధర్ బి. లూధియానా సి. అమృతసర్ డి. సిమ్లా.
3. స్వాతంత్ర్యానికి పూర్వం బ్రిటిష్ ప్రభుత్వ వేసవికాల రాజధానిగా ఏ పట్టణం ఉండేది?
   ఎ. శ్రీనగర్ బి. సిమ్లా సి. డెహ్రాడూన్ డి. డల్హౌసీ
4. మన జాతీయ వృక్షం ఏది?
   ఎ. వేప బి. మామిడి సి. బోధి డి. మర్రి
5. వెదురును ఏ విభాగం కింద పరిగణిస్తారు?
   ఎ. చెట్టు బి. తీగ సి. అడవి మొక్క డి. గడ్డి
6. బాతిక్ అంటే —
   ఎ. ఒకరకం నేత పద్ధతి బి. మినియేచర్ చిత్రలేఖనం
   సి. రంగులు అద్దే విధానం డి. శిల్పశైలి
7. బెంగుళూరును భారతదేశ 'సిలికాన్ వ్యాలీ' అంటారుకదా. మరి మనదేశ ఉక్కునగరం ఏదో తెలుసా?
   ఎ. సేలం బి. రూర్కెలా సి. జెమ్‌షెడ్‌పూర్ డి. భిలాయ్.

(సమాధానాలు వచ్చే సంచికలో)

## జూన్ క్విజ్ సమాధానాలు

1. ఆరావళి
2. కావేరి
3. మహానది
4. కేరళ
5. గోవా
6. వెంబనాడ్
7. మహాబలేశ్వర్
8. శారావతి
9. నావల్‌సాగర్
10. బుందేలాలు



# తండ్రీ కొడుకుల కథ

పూర్వం ఒకానొక పెద్ద పట్నంలో సజ్జనుడూ, గొప్ప సంపన్నుడూ అయిన సోమనాథుడనే పెద్దమనిషి ఒకాయన ఉండేవాడు. ఆయనకు లేకలేక ఒకే ఒక మగబిడ్డ కలిగాడు. చాలా కాలానికి కలిగిన బిడ్డగదా అని, దంపతులి ద్దరూ పిల్లవాణ్ణి అతి గారాబంగా పెంచు కొచ్చారు. అయితే, వాడు మాత్రం వాళ్ళ గారా బానికి తగినట్టుగా బుద్ధిగా పెరగక పెంకెగా, దుందుడుకుగా ప్రవర్తిస్తూ, రానురాను పెద్ద అహంకారిగా తయారయ్యాడు.

ఇదంతా గమనిస్తూన్న సోమనాథుడు, కొడుకు పెళ్ళీడుకొచ్చినవాడుగనక, వాడిని నేర్పుగా మంచి మార్గాన పెట్టడం ఎలా అని బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు.

ఒకనాడు, సోమనాథుడు, కొడుకును చేరబిలిచి, "ఒరే, బాబూ! నువ్వు పెద్దవాడి వయ్యావు. నీకు తగిన పిల్లను చూసి పెళ్ళి చేయాల్సిన సమయం వచ్చింది. ఈ సంద ర్భంగా నీకొక కొత్త విషయం చెప్పదలిచాను, విను! నాకు కోదండపాణి, బలరాముడు అని ఇద్దరు స్నేహితులున్నారు. చాలాకాలం నుంచీ రాకపోకలు లేకపోయినా, ఒకరి విషయాలు మరొకరికి తెలుస్తూనే వున్నాయి. వాళ్ళిద్దరివీ కూడా ఒకప్పుడు సంపన్న కుటుం బాలే! ఐతే కాలం ఖర్మం కలిసిరాక ఇప్పుడు ఇద్దరూ దీనస్థితిలోనే ఉన్నట్లు తెలిసింది. వాళ్ళిద్దరికీ చెరొక కూతురూ, నీకు ఈడుకా గల వయసు వాళ్ళున్నారు. వాళ్ళిద్దరిలో ఎవరు నచ్చితే వాళ్ళను మా కోడలిగా చేసుకోవల సిందని, స్నేహితులిద్దరూ నా దగ్గర వాగ్దానం తీసుకున్నారు. అంచేత, మనిద్దరం వెళ్ళి, పిల్లలిద్దర్నీ చూసి వద్దాం," అని చెప్పాడు.

లక్ష్మిగాయత్రి



ఇందుకు కొడుకు, తండ్రి మాటలను తేలిగ్గా తీసిపారేస్తూ, ''ఏనాటిమాటో పట్టుకుని పైసాకు కొరగానివాళ్ళను వెతుక్కుంటూ అంతదూరం వెళ్ళడం దండగ, నాన్నా, వద్దు!'' అన్నాడు.

కొడుకు మాటలకు సోమనాధుడు నొచ్చుకుని, ''అదేం మాటరా! నీకు వేరే సంబంధం నిశ్చయిస్తే, నాకు ఆడితప్పిన వాడినన్న పేరు కలకాలం ఉండిపోదూ!'' అన్నాడు.

తండ్రిపట్ల కొద్దోగొప్పో గౌరవం కలవాడు గనక, కొడుకు ఇక మారుమాట్లాడకుండా ఒప్పుకున్నాడు.

తండ్రీ కొడుకులిద్దరూ మర్నాటి ఉదయానే తమ గుర్రబ్బండిలో బయలుదేరి, ముందుగా కోదండపాణి ఉంటున్న చక్రధరపురం వెళ్ళారు. వాళ్ళు అక్కడికి చేరేసరికి ఎండ బాగా పైకి వచ్చింది. ఊళ్ళో కొద్దిదూరం వెళ్ళాక సోమనాధుడు కాస్త శుభ్రంగా కనిపిస్తున్న ఒక మిద్దె ఇంటిముందు బండి ఆపించి దిగాడు. ఇంటి యజమానిని కేకవేసి పిలిచి, ''అయ్యా! ఓగువాడ కోదండపాణిగారిల్లెక్కడో చెబుతారా?'' అంటూ అడిగాడు.

ఇంటి యజమాని సోమనాధుడి ధనిక వేషాన్నీ, ఎంతో విలువైనదిగా కనిపిస్తున్న గుర్రబ్బండినీ చూసి, మర్యాదగా సోమనాధుణ్ణి సమీపించి, ''కోదండపాణి కోసం వచ్చారా?'' అని, మరేదో అడగబోయి సంశయిస్తున్నట్టు ఆగాడు.

అది గ్రహించిన సోమనాధుడు, ''ఆయనతో వియ్యమందడానికి వచ్చానులెండి. బండిలో కూర్చున్న కుర్రవాడే పెళ్ళికొడుకు. నా ఏకైక సంతానం!'' అన్నాడు.

ఆ మాట వినగానే, ఇంటి యజమాని పరమానందంగా, ''ఏమిటీ, కోదండపాణి గారి అమ్మాయిని చూడవచ్చారా? రండి, రండి, లోపలికి దయచేయండి!'' అంటూ, తండ్రీ కొడుకులిద్దర్నీ ఇంటిలోపలికి తీసుకువెళ్ళి మెత్తటి పరుపు పరిచి కూర్చోబెట్టాడు. తర్వాత వంటగదిలోకి వెళ్ళి, నిమ్మరసమూ ఉప్పూ కలిపిన మజ్జిగ తీసుకువచ్చి, ''ఎండన పడి వచ్చారు. ముందు చల్లని మజ్జిగ తాగండి,'' అంటూ తండ్రీకొడుకులకు ఇచ్చాడు.

అంతలో ఇంటాయన తల్లి పండుముత్తయిదువు వచ్చి, సోమనాధుడికి నవ్వుతూ నమస్కరించి కూర్చుని, ''కోదండపాణి కుమార్తె లక్ష్మిని చేపట్టే అదృష్టవంతుడెవరా అని, మాకెంతో ఆతృతగా వున్నదంటే నమ్మండి, బాబూ! పిల్ల నిజంగా లక్ష్మీదేవే. ఆ ఒద్దికా, ఆ పొందికా, ఆ పని నేర్పరితనమూ అందరికీ అబ్బవు. ఆ పిల్ల

# పట్టుపుటేనుగు




జంతువులలో కెల్లా బ్రహ్మాండమైన ఏనుగు పట్ల ఆసక్తి చూపడం అన్నది ఇవాళ్టి, నిన్నటి విషయం కాదు. మన రాజులు ఏనుగు అంబారీల మీద ఊరేగేవారు. చతురంగ బలాలలో గజబలం రెండవది. ఉత్సవాలలో, ఊరేగింపులలో ఏనుగులు ప్రత్యేక ఆకర్షణ. దేవుళ్ళను కూడా ఏనుగుల మీద ఊరేగించడం మన సంప్రదాయం. ఇక పిల్లల విషయానికి వస్తే ఏనుగులంటేనే ఎగిరి గంతేస్తారు. దాని ఆకారం, పరిమాణంతోపాటు అది పిల్లలపట్ల చూపే స్నేహ భావం అలాంటిది!

చందమామ 56 వ సంవత్సరంలో అడుగుపెడుతూన్న జన్మదినోత్సవ సందర్భంగా, ఉత్సాహవంతులైన పిల్లల కోసం అట్టమీద ఏనుగు రేఖాచిత్రాన్ని ముద్రించి కానుకగా అందజేస్తున్నది. దీంతో మీరే ఒక అందమైన పట్టుపుటేనుగును తయారుచేసుకోవచ్చు. ఇది మీలోని సృజనాత్మక శక్తికి పనికల్పించి, పదును పెడుతుంది. సరే, ఇప్పుడు పట్టపుటేనుగు బొమ్మను తయారు చేద్దాం రండి.

రేఖాచిత్రాన్ని అనుసరించి, అట్టమీది అదనపు భాగాలను తొలగించి, పచ్చటి రంగు భాగాలతోపాటు పట్టపుటేనుగు ఒక్కొక్క భాగాన్నీ జాగ్రత్తగా కత్తిరించుకోండి. సూచించిన నీలం రంగు గీతలను అనుసరించి ఏనుగు శరీరభాగాన్నీ(ఎ), తల భాగాన్నీ (బి),

శాలువానూ(సి) మడుచుకోండి. ఏనుగు తొండం దగ్గర ఉన్న పచ్చటి భాగాలను ఒకటిగా కలిపి అతికించండి. ఆ తరవాత బ్లేడుతోగాని, చిన్న కత్తితో గాని ఏనుగు శరీరభాగం మీదా, తల భాగంలోనూ ఉన్న ఎఱ్ఱటి గీతల మీద సన్నటి గాడిలా కత్తిరించుకోండి.









శాలువా అంచున, తోకకు మొదటు, చెవుల పక్కన, దంతాలకు మొదటవున్న పచ్చటి భాగాలను లోపలి వైపుకు మడుచుకోండి. ఆ తరవాత ఏనుగు శరీరం మీద అందమైన శాలువా (2) తల (3), చెవులు (4), దంతాలు (5), తోక (6) వీటిని సరైనచోట అంటే సన్నగా కత్తిరించిన చోట, మడిచిన అంచులను లోపలికి దోపి సరిగ్గా అమర్చండి.






మీ నట్టింట కాలు మోపిందంటే, ఇక లక్ష్మి మీ ఇంట కొలువు తీరినట్టే!'' అన్నది.

సోమనాథుడు నవ్వుతూ, వింటున్నావా? అన్నట్టు కొడుకువైపు చూశాడు. మరొక అరగంట గడిచేసరికి, ఇంటాయనా, ఆయన తల్లీ, ''కోదండపాణి కాబోయే వియ్యంకుడు, మాకూ బంధువే! ముందు భోజనాలు చెయ్యండి,'' అని, తండ్రీకొడుకులకు విందు భోజనాలు పెట్టారు.

ఆ తర్వాత, కోదండపాణి కుమార్తెకు పెళ్ళిసంబంధం వచ్చిందని తెలిసిన గ్రామస్థులు నలుగురైదుగురు కలిసి, తండ్రీ కొడుకులను స్వయంగా కోదండపాణి ఇంటికి తీసుకువెళ్ళారు.

కోదండపాణి ఇల్లు బీదగా వున్నా, పరిశుభ్రంగా కళకళలాడుతున్నది. మిత్రుణ్ణీ చూసి ఆనందంతో పొంగిపోయిన కోదండపాణి, వాళ్ళకు అతిథిమర్యాదలన్నీ గ్రామస్థులు చేసేశారని తెలుసుకుని నొచ్చుకున్నాడు. కొద్దిసేపు తర్వాత, కోదండపాణి కూతురు లక్ష్మిని చూసి, ఆమెతో మాట్లాడిన తండ్రీకొడుకులిద్దరూ గ్రామస్థులు ఆమె గురించి ఒక్క పొల్లుమాట కూడా మాట్లాడలేదనీ, ఆమె నిజంగానే అందగత్తే, తెలివితేటలుగలదనీ గ్రహించారు.

కోదండపాణి ఇంట ఒక గంటసేపు ఉండి, సోమనాథుడు, కొడుకును వెంటబెట్టుకుని బలరాముడు వుండే అనంతవరానికి బయలుదేరాడు. వాళ్ళు ఆ గ్రామం చేరేసరికి పొద్దుగూకి కనుచీకటి పడుతున్నది. గ్రామంలో ప్రవేశిస్తూనే, ఎదురుపడినవారిని కోదండపాణి గురించి అడిగినట్టే, తన రెండవ మిత్రుడు



బలరాముడి ఇంటి గురించి విచారించాడు, సోమనాధుడు.

బలరాముడు పేరు వింటూనే గ్రామస్థుడు ముఖం చిట్లిస్తూ, ''బలరాముడి ఇల్లా! ఆ ఇంద్రభవనం చేరాలంటే చాలా సందులూ, గొందులూతిరగాలి. ఇంతకూ,తమకామహాను భావుడితో పనేమిటోమరి?'' అంటూ కాస్త వెటకారంగా ప్రశ్నించి, సోమనాధుడి జవాబు వింటూనే, ''అబ్బో, బలరాముడితో వియ్యమే! మరింకేం వెళ్ళండి, వెళ్ళండి,'' అని చకచకా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత సోమనాధుడు మరొక ముగ్గురు నలుగుర్ని ప్రశ్నించినా లాభం లేకపోయింది. ఎవరూ వాళ్ళకు గుక్కెడు మంచి నీళ్ళు ఇవ్వడంగాని, బలరాముడి ఇంటికి దారి చూపించడంగాని చెయ్యలేదుసరికదా, ఏదో సూటీపోటీ మాటలు విసురుతూనే వచ్చారు.

చివరకు సోమనాధుడు నిట్టూరుస్తూ, బండిలో కూర్చుని, ''కోదండపాణి నెమ్మదస్తుడు, వినయగుణం కలవాడు. లక్షాధికారి అయినప్పటికీ అందరితోనూ మంచిగా, మర్యాదగా ప్రవర్తించాడు. ఆ నైతికబలమే ఈనాటి బీదస్థితిలో అతడికి కొండంత అండగా నిలిచి, గ్రామస్థులంతా అతడితో బంధుత్వం కోరివచ్చిన మనలను ఆదరించేలా చేసింది. బలరాముడు అహంకారి. ధనవంతుడినన్న గర్వంతో కన్నూమిన్నూ కానకుండా ప్రవర్తించేవాడు. ఇప్పుడా ధనబలం లేకపోయేసరికి, అతడి బతుకు నలుగురిలో నవ్వుల పాలైంది!'' అని స్వగతంలా చెప్పుకుని, ''సరే, ఇక మనకు అతడింటిదారి ఎవరూ చెప్పేలా లేరు. మనపాట్లు మనం పడి వెతుక్కోవలసిందే,'' అన్నాడు కొడుకుతో.

తండ్రి ఇలా అనగానే కొడుకు ఒక నిమిషంతలవంచుకుని ఏదో ఆలోచిస్తూ పూరుకుని, తర్వాత, ''వద్దు నాన్నా, ఇక మనం బలరాముడి ఇంటికి వెళ్ళనవసరం లేదు. నాకు కోదండపాణిగారి అమ్మాయి లక్ష్మి నచ్చింది. కావాలంటే, నువ్వెప్పుడైనా ఈ గ్రామం వచ్చి, నీ పాతకాలపు స్నేహితుణ్ణి కలుసుకుని నాలుగు మంచిమాటలు చెప్పు, సరిపోతుంది!''అన్నాడు.

కొడుకు మాటల్లో కొత్తగా తొణికిసలాడుతున్న అణకువా, వినమ్రతా సోమనాధుడి మనసును ఉర్రూతలూగించింది. అతడు తన ఆలోచన ఫలించినందుకు తృప్తిగా నిట్టూర్చి, ''అలా చేద్దామంటావా? సరే, నీ ఇష్టప్రకారమే కానీ,'' అని, బండి తోలేవాడితో, తమ గ్రామానికి బయల్దేరి వెళదామన్నాడు.






# మెరిసేవన్నీ....

మనదేశాన్ని ధీమంతులూ, వివేక సంపన్నులూ అయిన గొప్ప రాజులు ఎందరో పరిపాలించారు.అయినా, పరిపాలించిన వారందరూ అలాంటి తెలివి తేటలు కలవారని చెప్పలేము. అయితే, రాజులూ, రాణులూ అందరినీ కూడా ధగధగాయమానంగా మెరిసేలా చేశాయి వాళ్ళు ధరించిన వజ్ర వైడూర్యాలు పొదిగిన స్వర్ణ ఆభరణాలు!



ఈ ఆభరణాల రక్షణకు రాజులు చేపట్టవలసిన చర్యలనూ, అమలు చేయవలసిన నియమ నిబంధనలనూ గురించి క్రీ.పూ. 3వ శతాబ్దానికి చెందిన చాణక్యుడు తన అర్థశాస్త్రంలో వివరించాడు. ప్రతి పాలకుడూ తన రాజ్యంలో ఎక్కడెక్కడ ఖనిజసంపద నిక్షిప్తమై ఉన్నదీ తెలుసుకుని ఉండాలనీ, తవ్వి వెలికి తీసిన ఖనిజాల మీద సంపూర్ణ నియంత్రణ ఉండాలనీ చాణక్యుడు చెప్పాడు. రాజులు వాటిని చక్కగా మనసులో నిలుపుకుని, తమ రాజ్యంలోని గనుల్లో లభించే మణులూ, మాణిక్యాలూ, వజ్ర వైడూర్యాలూ తమ ఖజానా చేరడానికి తగు జాగ్రత్తలు తీసుకుని కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేశారు!



# అస్సాం ప్రాంత సత్రియా నాట్యం!

నాట్యం గురించి మాట్లాడేప్పుడు మామూలుగా భరతనాట్యం, ఒడిస్సీ, కూచిపూడి, కథకళి మొదలైన నాట్యరీతులే గుర్తుకు వస్తాయి. ఇప్పుడు అస్సాం ప్రాంతానికి చెందిన సత్రియా నాట్యాన్ని కూడా ఈ జాబితాలోకి చేర్చుకోవాలి. దీనిని 15వ శతాబ్దానికి చెందిన శంకరదేవుడనే వైష్ణవాచార్యుడు రూపొందించాడు. ప్రారంభకాలంలో దీనిని పురుషులు మాత్రమే ప్రదర్శించేవారు. ఆ తరవాత స్త్రీలు కూడా ప్రదర్శనలివ్వడం ప్రారంభించారు. కథకళిలాగే ఈ నాట్యం—దృశ్యాలుగా విభజించబడకుండా 'సూత్రధారి' వ్యాఖ్యానంతో నృత్యకళానాటకశైలిలో ఏకధాటిగా సాగుతుంది!

## అస్సాం జానపద కథ

# తేజిమాల

భారత ఈశాన్య రాష్ట్రాలకు సింహద్వారంగా ఉంటూన్న అస్సాం ఎర్రనది - నీలి కొండల భూమిగా పేరుగాంచింది. ఈ ప్రాంతంలో ప్రవహించే బ్రహ్మపుత్ర నదిని ఎర్రనది అంటారు. ఎటువైపు చూసినా కనిపించే కొండలను నీలికొండలు అంటారు.

అస్సాం ఉత్తరదిశలో అరుణాచల్ ప్రదేశ్, భూటాన్‌లు; తూర్పుదిశలో నాగాలాండ్, మణిపూర్, బర్మాలూ; దక్షిణంగా త్రిపుర, మిజోరాం, బంగ్లాదేశ్‌లూ, పశ్చిమంగా పశ్చిమ బెంగాల్ సరిహద్దులుగా కలిగి ఉన్నది.

అస్సాం అనే పేరు సంస్కృత పదం 'అసోమ్' (అంటే 'అసమం') నుంచి వచ్చిందంటారు. ఇక్కడి భూమి కొండలతో, నదులతో, మైదానాలతో హెచ్చుతగ్గులుగా, మిట్టపల్లాలతో నిండి ఉండడంవల్ల ఈ పేరు వచ్చి ఉండవచ్చు. ఇక్కడి భూభాగాన్ని 'అహోం' తెగ నాయకులు ఆరు శతాబ్దాలకు పైగా పరిపాలించారు. వారి పేరు మీదుగానే ఈ ప్రాంతానికి ఈ పేరు వచ్చింది. 'అహోం' అనే పేరే అసోం - అస్సాంగా రూపాంతరం చెంది ఉంటుందని మరికొందరి అభిప్రాయం.

78,523 కి.మీ. వైశాల్యం కలిగిన ఈ రాష్ట్ర జనాభా 2,66,38,407. దిస్పూర్ రాష్ట్ర రాజధాని. అస్సామీ, బెంగాలీ రాష్ట్ర అధికార భాషలు.

బ్రహ్మపుత్రానదీ తీరంలో, బ్రహ్మాండమైన జైంతియా కొండలకు ఎదురుగా ఉన్న ఒక అందమైన గ్రామంలో బ్రిఘు అనే ధనిక వ్యాపారి ఉండేవాడు. ఆయనకు ఒక అందమైన కూతురు పుట్టింది. ఆమె పేరే తేజిమాల. ఆమె బిడ్డగా ఉన్నప్పుడే ఆమె తల్లి మరణించింది. ఆమె తండ్రి కాంచన్ అనే యువతిని రెండో పెళ్ళి చేసుకున్నాడు. ఆమె మహాక్రూరురాలు. ఇంట్లో అడుగు పెట్టినప్పటి నుంచి తేజిమాలను రకరకాలుగా బాధపెట్టసాగింది.

తేజిమాల చాల మంచి అమ్మాయి. సవతి తల్లిమాట జవదాటకుండా ఆమె చెప్పిన పనులన్నీ చేసేది. ఇల్లంతా శుభ్రంగా చిమ్మేది.



అంట్లు తోమేది. బట్టలుతికేది. నదికి వెళ్ళి నీళ్ళు తెచ్చేది. ఇన్ని పనులు చేసినా సవతి తల్లి మాత్రం తేజిమాల మీద చీటికీమాటికీ విరుచుకుపడేది. నానా మాటలనేది. తరచూ చేయి చేసుకునేది.

భిఘు వ్యాపారి గనక, ఇంటిపట్టున అంతగా ఉండేవాడు కాదు. వ్యాపార నిమిత్తం ఊళ్ళు తిరుగుతూ ఉండేవాడు. ఆయన లేనప్పుడు తేజిమాల పరిస్థితి మరీ దుర్భరంగా తయారయ్యేది. సవతి తల్లి పెట్టే బాధలకు అంతు ఉండేది కాదు. మామూలు రోజుల కన్నా ఎక్కువ పనులు పురమాయించేది. తేజిమాల వంటపనులు కూడా పూర్తిచేసి, అంగడికి వెళ్ళి సరుకులు కొని మోసుకు వచ్చేది. అంతేకాదు; పొలానికి వెళ్ళి వరి చేలలో కూలీలకూ సాయమందించేది.



ఇంతగా కష్టపడే బిడ్డకు కడుపు నిండా తిండికూడా పెట్టేది కాదు ఆ మహాతల్లి. రోజుకు ఒకపూట గంజే. అదికూడా ఉప్పు వేసిన గిన్నెడు పలుచటి బియ్యం గంజి; రెండు మిరపకాయలు - అంతే!

తండ్రి ఊళ్ళో లేనప్పుడు తేజిమాలకు

## తేయాకు తోటలు



అస్సాం అనగానే మన మనసుల్లో మొట్ట మొదటగా కదలాడేవి విస్తారమైన తేయాకు తోటలు. ప్రపంచంలో తేయాకు పండే ప్రాంతాలలో ముఖ్యమైనది అస్సాం. మన దేశంలో పండే మొత్తం తేయాకులో యాభై శాతం ఇక్కడే పండుతున్నది.

ప్రపంచంలోనే మొట్టమొదటి తేయాకు కంపెనీ - ది అస్సాం కంపెనీ ఇక్కడే ప్రారంభించారని చెబుతారు. 1839 ఫిబ్రవరి 12 వ తేదీ దానిని స్థాపించారు. విశ్వకవి రవీంద్రనాథ టాగూర్ తాతగారు ద్వారకానాథ టాగూర్ ఈ కంపెనీ డైరక్టర్లలో ఒకరు. వాసనకూ, రంగుకూ ప్రసిద్ధిగాంచింది అస్సాం టీ.

ఈనాడు బ్రహ్మపుత్ర లోయలో 2,30,000 హెక్టార్లకు పైగా తేయాకు తోటలు ఉన్నాయి. గౌహతిలో ప్రపంచంలోకెల్లా అతిపెద్ద తేయాకు వేలం కేంద్రం (టీ ఆక్షన్ సెంటర్) ఉంటున్నది.

ఒంటినిండా బట్ట కూడా ఉండేది కాదు. చీలికలు పేలికలుగా వున్న బట్టలు చుట్టు కుని తిరుగుతూండేది. ఆమె తండ్రి తిరిగి వస్తూన్నాడని తెలియగానే సవతి తల్లి వెళ్ళి రెండు జతల కొత్తదుస్తులు తెచ్చి ఆమెకిచ్చేది.

ఇన్ని బాధలు పెడుతూన్నప్పటికీ తేజిమాల, సవతి తల్లిని పల్లెత్తుమాట అనేది కాదు. చాటున సైతం ఎవరితోనూ చెప్పుకునేది కాదు. అన్నిటినీ ఎంతో సహనంతో భరించేది.

రోజులు గడవడంతో తేజిమాల పెరిగి యుక్త వయస్కురాలయింది. కూతురికి పెళ్ళీడు వచ్చిందని గ్రహించిన ఆమె తండ్రి తగిన వరుడికోసం వెతకసాగాడు. ఆ సంగతి తెలియగానే కాంచన్ హతాశురాలయింది. తేజిమాల పెళ్ళిచేసుకుని అత్తవారింటికి వెళ్ళిపోతే, తన ఇల్లు చిమ్మేదెవరు? అంట్లు తోమేదెవరు? తన బట్టలు ఉతికేదెవరు? ఏటికెళ్ళి నీళ్ళు తెచ్చేదెవరు? అని విచారపడ సాగింది. అయితే, తన విచారాన్ని బయట పెట్టలేదు. తండ్రికి తేజిమాల మీద అమిత ప్రేమ అని ఎరిగి ఉండడంవల్ల కూతుర్ని ఇంట్లో పనిపిల్లగానే ఉంచుకోవాలన్న తన మనసులోని దురాలోచన తెలిస్తే శిక్షించగలడని భయపడింది. అందువల్ల ఏం చేయాలా అని మనసులోనే తీవ్రంగా ఆలోచించసాగింది.

బ్రిఘు వ్యాపారం కోసం వెళ్ళినచోటల్లా వరుడికోసం అన్వేషించాడు. ఆఖరికి ఒక తెలివైన అందమైన యువకుణ్ణి వరుడిగా నిర్ణయించాడు. యువకుడి తల్లిదండ్రులతో తన కోరికను వెలిబుచ్చాడు. బ్రిఘు కుటుంబంలాంటి మంచి కుటుంబంతో వియ్యమందడానికి వాళ్ళు పరమ సంతోషంతో సమ్మతి తెలియజేశారు.

బ్రిఘు ఇంటికి తిరిగి రాగానే ఆ సంగతి

## కళలు - హస్తకళలు




అస్సాంలో చేనేత పరిశ్రమ ఒక జీవన విధానంగానే కొనసాగుతున్నది. ప్రత్తి, ముగా పట్టు, పాల్‌పట్టు, ఎర్రిపట్టుతో చేనేత వస్త్రాలను నేస్తారు. ముగా పట్టుకున్న అరుదైన ప్రకాశం, సహజమైన బంగారు రంగు ఉతికేకొద్దీ మరింత ఆకర్షణీయంగా కనిపిస్తుంది. ఎర్రీ పట్టు వెచ్చగా ఉంటుంది గనక, శీతాకాలానికి అనువైనది.

వెదురు పుల్లల అల్లికకు కూడా అస్సాం ప్రసిద్ధిగాంచింది. చలానీ (జల్లెడలు) కులా (చేటలు) ఖోరాహీ (బుట్టలు) మొదలైన గృహోపకరణాలు తయారుచేయడానికి వెదుళ్ళను ఉపయోగిస్తారు. అస్సామీ రైతులు పొలంలో పనిచేసేప్పుడు తలకు అందంగా, ఆకర్షణీయంగా తయారుచేసిన వెదురు టోపీలను పెట్టుకుంటాడు.



భార్య కాంచన్‌తో చెప్పాడు. ఆమె అసూయతో కుమిలిపోయింది. 'మెట్టినింట్లో తేజిమాల మహారాణిలా వెలిగిపోతుంది. నేనేమో ఇక్కడ ఎవరి తోడూ లేకుండా ఇల్లు ఊడుస్తూ, బట్ట లుతుకుతూ బండెడు చాకిరీ చేస్తూ కాలం వెళ్ళబుచ్చాలి!'' అని వేదన పడసాగింది.

కాబోయే అల్లుడి ఉజ్వల భవిష్యత్తు కోసం బ్రిఘు కొన్ని పథకాలు రూపొందించాడు. ''నా బిడ్డను తెలివైన యువకుడు పెళ్ళాడనున్నాడు. అతనికి ప్రపంచ వ్యవహారాలలో మరింత అనుభవజ్ఞానం కలిగించడం అవసరం,'' అని భావించాడు. అందువల్ల వివాహానికి ముందే బ్రిఘు కాబోయే అల్లుణ్ణి వెంటబెట్టుకుని ఇతర ప్రాంతాలకు బయలుదేరాడు. ఇరువురూ వివిధదేశాలు తిరుగుతూ వివిధ నగరాలను సందర్శించసాగారు.

అయితే ఇక్కడ గ్రామంలోని తేజిమాల సవతి తల్లికి ఇవన్నీ మింగుడుపడలేదు. తేజిమాల బంగారు భవిష్యత్తును ఊహించి అసూయతో భరించలేకపోయింది. ఆమెను ఎలాగైనా వదిలించుకోవాలని నిర్ణయించింది.

ఒకనాడామె తేజిమాలను పిలిచి వడ్లు దంచమని చెప్పింది. అమాయకురాలైన తేజిమాల తల వంచుకుని దంచిన బియ్యం నుంచి పొల్లు అదీ ఏరుతున్నప్పుడు క్రూరురాలైన సవతి తల్లి ఆమె తలమీద రోకలితో బలంగా కొట్టింది. అంతే, తేజిమాల ఆ దెబ్బతో ప్రాణం విడిచింది!

కాంచన్ ఇల్లు ఎత్తుకుపోయేలా గట్టిగా అరుస్తూ శోకాలు పెట్టసాగింది. ఆమె అరుపులు విని పరుగెత్తుకు వచ్చిన ఇరుగు పొరుగు, ''ఏమయింది?'' అని అడిగారు.

## ఆసియాలో మొట్టమొదటి చమురుశుద్ధీకరణ కర్మాగారం

ఆసియాలో నెలకొల్పబడిన మొట్టమొదటి చమురుశుద్ధి కర్మాగారం ఎగువ అస్సాంలోని దిగ్బాయ్‌లో ఉన్నది. మనదేశంలో చమురు-పెట్రోలియం పరిశ్రమకు ఇది పునాదులు వేసింది. పెన్సిల్‌వేనియాలో కల్నల్ డ్రేక్ చమురును కనుగొన్న ఎనిమిది సంవత్సరాల తరవాత అంటే, 1867 వ సంవత్సరంలో ఇక్కడ మొట్ట మొదటిసారిగా 'క్రూడ్‌ఆయిల్' కనుగొనబడింది.

దిగ్బాయ్‌లో చమురు బయటపడడానికి ఒక ఏనుగు దోహదంచేసిందన్నది ఆసక్తికరమైన విశేషం. డిబ్రూ-సాడియా రైల్వేలైను మీద పనికి నియోగించిన ఒక ఏనుగు అరణ్యమధ్యానికి పారిపోయి, మళ్ళీ కొన్నాళ్ళకు తిరిగివచ్చింది. అప్పుడు దాని పాదాలకు చమురు ఉండడం చూశారు!

వంద యేళ్ళకు పైగా పనిచేస్తున్న దిగ్బాయ్, ఈనాడు భారత ఉపఖండంలోని శుద్ధీకరణ కర్మాగారాలలోకెల్లా ప్రాచీనమైనదిగా ఉంటోంది.

# కజిరంగా నేషనల్ పార్క్

అస్సాం నడిబొడ్డున దాదాపు 688 చ.కి.మీ. విస్తరించి ఉన్న 'కజిరంగా నేషనల్ పార్క్' ఒంటికొమ్ము ఖడ్గమృగాలకు రక్షణ కల్పిస్తోంది. ఇరవైయవ శతాబ్దారంభంలో బ్రిటిష్ పాలనాకాలంలో ఖడ్గమృగాలను విపరీతంగా వేటాడడంతో అవి నశించిపోయే స్థితికి చేరుకున్నాయి. ఆ అపాయకర పరిస్థితిని గ్రహించిన బ్రిటిష్ ప్రభుత్వం ఈ మృగాలపై కనికరించి ఈ ప్రాంతాన్ని సంరక్షిత (రిజర్వ్డ్), అరణ్యంగా ప్రకటించి, వేటను నిషేధించింది. 1940 వ సంవత్సరంలో దీనికి వన్య ప్రాణులఅభయారణ్యం అంతస్తు లభించింది. 1974 వ సంవత్సరంలో నేషనల్‌పార్క్ అయింది. బ్రహ్మపుత్ర నదీతీరంలో ఉన్న ఈ పార్క్‌లో ఇవాళ 1,000 పైగా ఖడ్గమృగాలు




ఉన్నాయి. వీటితోపాటు నీటిగోదెలూ, జింకలూ, గంగాడాల్ఫిన్లూ కూడా ఇక్కడ ఉన్నాయి.

కాంచన్ నెత్తీ, నోరూ బాదుకుంటూ, జుట్టు విరబోసుకుని, "అయ్యో! నేనేం చేయను? నా ప్రాణానికి ప్రాణంగా వున్న నా కూతురు చచ్చిపోయిందే! దానికి పెళ్ళికూడా కుదిరిందని మేమంతా మురిసిపోయామే! ఇప్పుడిలా అయిపోయిందే!" అంటూ, అది ప్రమాదవశాత్తు జరిగిన మరణమే అని గ్రామస్థులు నమ్మేలా శోకాలు పెట్టి ఏడ్చింది. వాళ్ళందరూ ఆమెను ఎంతో సానుభూతితో ఓదార్చి, తేజిమాల శవాన్ని ఇంటి తోటలో పాతిపెట్టారు.

ఒక వారం రోజుల తరవాత తేజిమాలను పాతిపెట్టినచోట ఒక గుమ్మడి మొలక మొలిచింది. ఆ గుమ్మడి తీగ చూస్తూండగానే చకచకా పెరిగి పెద్దపెద్ద కాయలు కాచింది. ఒకరోజు దారిన వెళుతూన్న ఒకడు గుమ్మడి కాయను దొంగిలించాలని నెమ్మదిగా వెళ్ళి ఒక కాయను కోయబోయాడు. "బాబూ! నన్ను ముట్టకండి! నేను గుమ్మడికాయను కాను; తేజిమాలను," అన్న మాటలు వినిపించడంతో ఆ మనిషి ఉలిక్కిపడి, భయంతో అక్కణ్ణించి పారిపోయాడు.

గుమ్మడికాయ చెప్పిన మాటలను తేజిమాల సవతితల్లి కూడా విన్నది. "దేవుడా! నా భర్త తిరిగివచ్చి గుమ్మడికాయ ద్వారా అసలు సంగతి తెలుసుకుంటే నా గతేంకాను?" అనుకుంటూవచ్చిగుమ్మడిపాదును నాశనం చేసింది.

కొన్నివారాల తరవాత, గుమ్మడి తీగ ఫడిన చోట ఒక మిరప మొక్క మొలిచింది. ఒక వారంలో చెట్టునిండా ఎరుపు, పచ్చ మిరప కాయలు కాచాయి.

ఆ దారిగుండా వెళ్ళే పశుల కాపరులు కొందరు, మిరపకాయలు కోసుకోవడానికి ప్రయత్నించారు. అయితే, "కరుణించి నన్ను ముట్టకండి. నేను మిరపను కాను; తేజిమాలను," అన్న మాటలు వినిపించడంతో, అవి తేజిమాలదయ్యం మాటలని భావించి పశుల కాపరులు జడుసుకుని పారిపోయారు.

తేజిమాల సవతి తల్లి ఆ మొక్కను పీకి, చిన్నాభిన్నం చేసి బ్రహ్మపుత్ర నదిలోకి విసిరి వేసింది. అది పడినచోట ఒక అందమైన తామర తీగ మొలకెత్తింది. కొన్నాళ్ళకు తామరపువ్వు పూచింది. ఆ సమయంలో తమ ప్రయాణాన్ని పూర్తిచేసుకుని ఇంటికి తిరుగు ప్రయాణమైన బ్రిఘు, ఆయన కాబోయే అల్లుడు ఒక చిన్న పడవలో అటు కేసి వచ్చారు. యువకుడు ఆ అందమైన తామరపువ్వును చూసి, అందుకోవడానికి చేయి సాచాడు.

"దయచేసి నన్ను ముట్టుకోకండి. నేను తామరను కాను; తేజిమాలను," అంటూ పువ్వు



## సుప్రసిద్ధ దేవీ ఆలయం

అస్సాంలోని నీలాచల్ కొండల మీద దాదాపు 160 మీ. ఎత్తులో కామాఖ్యదేవీ ఆలయం నెలకొని ఉన్నది. భారతదేశం లోని శక్తిపీఠాలలో ముఖ్యమైనదిగా దీనిని పరిగణిస్తారు. దీనికిసంబంధించిన పురాణ గాథలు ఉన్నాయి.మనదేశంలోని సుప్రసిద్ధమైన దేవీ ఆలయాలలో కామాఖ్యదేవీ ఆలయం కూడా ఒకటి.

విలపించింది. యువకుడు చేయి వెనక్కు తీసుకున్నాడు. ఆ మాటలకు తేజిమాల తండ్రి దిగ్భ్రాంతి చెందాడు. తన కుమార్తె మరణించిన సంగతికూడా ఆయన ఎరుగడు. అయితే, వినిపించిన కంఠస్వరం తన కుమార్తెదే అని ఆయన గ్రహించాడు.

"అమ్మా తేజిమాలా! నువ్వెక్కడున్నావు తల్లీ? మీ నాన్న దగ్గరికి రా!" అంటూ కన్నీళ్ళతో పిలిచాడు.

ప్రియమైన తండ్రి కంఠస్వరాన్ని వినగానే, అందమైన తామరపుష్పం తేజిమాలగా మారి పోయింది. తండ్రిని సమీపించి జరిగినదంతా వివరించింది. తన బిడ్డను నానా హింసలు పెట్టి, చంపిన భార్యమీద బ్రిఘుకు పట్టరాని ఆగ్రహం కలిగింది.

ఇంటి గుమ్మంలో తన భర్తా, ఆయన పక్కనే తేజిమాలా, యువకుడూ కనబడగానే కాంచన్‌కు తలపై పిడుగు పడ్డట్టయింది. తన గుట్టు బయటపడిందని గ్రహించింది. బ్రిఘు ఆ దుష్టురాలిని ఇంటినుంచి వెళ్ళగొట్టాడు. అనుకున్న యువకుడితో తేజిమాల వివాహం అత్యంత వైభవంగా జరిగింది.

## అపూర్వ విన్యాసం!



బడులలో యేటా క్రీడాపోటీలప్పుడు జరిపే కోడిగుడ్డు-చెంచా నడకపందెం గురించి మీకందరికీతెలిసే ఉంటుంది. ఒక స్పూను మీద కోడి గుడ్డును (లేదా నిమ్మపండును) ఉంచి అది పడిపోకుండా బ్యాలెన్స్ చేస్తూ నిర్ణీతదూరం నడవాలన్నమాట. ఎవరు ముందు వస్తే వాళ్ళు గెలిచినట్టు. అదిసరే, ఇప్పుడు మీ తలమీద పది అంగుళాల పొడవుగల పాలసీసాను (పాలతో నింపి) నిటారుగా ఉంచుకుని నిర్దిష్టదూరం పడిపోకుండా బ్యాలెన్స్ చేస్తూ నడవాలని ఊహించుకోండి. నిర్ణీతదూరం సీసా పడిపోకుండా నడిచినవారు బహుమతితోపాటు (కావాలంటే) ఆ సీసాలోని పాలు కూడా తాగవచ్చు. ఇలాంటి విన్యాసాన్ని భారతదేశంలో పుట్టిన సురేష్ జోకిమ్, ఆస్ట్రేలియాలోని సెంట్రల్ సిడ్నీలో చేసి చూపాడు. తలమీద పాలసీసా పడిపోకుండా అతడు ఎంతదూరం నడిచాడనుకున్నారు? (ఆశ్చర్యపోకండి) 133 కిమీ. దూరం! అతడు అంతదూరం నడిచి వెళ్ళినందువల్ల సీసాలోని పాలు చెడిపోయి వుండవచ్చు. కానీ బహుమతిని గెలుచుకున్నాడు; గిన్నిస్ బుక్ ఆఫ్ రికార్డ్స్‌లో స్థానం సంపాయించాడు!

## చీమల ప్రదర్శనశాల



చీమల ప్రదర్శనశాల కదా మరి అదికూడా చీమలంతే ఉంటుందేమో అనుకునేరు. ఇది 100,000 చీమలకు చోటు కల్పిస్తోంది. థాయ్‌లాండ్‌లోని కాసెట్-సార్ట్ విశ్వవిద్యాలయంలోని ఈ మ్యూజియంను అటవీశాఖ నిర్వహిస్తోంది. దాదాపు వంద చీమకుటుంబాలు, సజీవంగా ఉన్న 550 చీమల గుంపులను ప్రదర్శనకు ఉంచారు. మరో 100,000 చీమలను ఆల్కహాల్లో ఉంచి ఉన్నారు. కాబట్టి మీరు మునుముందు థాయ్‌లాండ్ (తెల్ల ఏనుగులకు ప్రసిద్ధిగాంచిన వెనకటి సయామ్) వెళ్ళినట్టయితే, ఈ చీమల ప్రదర్శనశాలను చూడడం మరిచిపోకండేం!



# విఘ్నేశ్వరుడు

ఒకనాడు నారదుడు కైలాసానికి వెళుతున్న దారిలో కంటకముఖి అనే ఒక యక్షిణి పరిహాసంగా, "నన్ను పెళ్లాడవయ్యా, నారదా! బ్రహ్మ చెర తప్పించుకోవయ్యా, బ్రహ్మ కొడుకా!" అని అన్నది.

నారదుడు ఆ మాటకు ఒక్క క్షణం ఉలిక్కిపడి కంటకముఖితో, "నేను కలహభోజనుడిని. కలహం వండిపెట్టగలది దొరకాలి గదా!" అన్నాడు.

"నేను, నీ కంటే జగడాలమారిని!" అంది యక్షిత.

ఆ సమయంలో విఘ్నేశ్వరుడూ, కుమారస్వామీ చెట్టాపట్టాలేసుకొని సంతోషంగా వస్తున్నారు. నారదుడు వాళ్ళను చూపుతూ, "ఆ వస్తున్న అన్నతమ్ముళ్ళ మధ్య జగడం తేగలవా?" అన్నాడు.

"ఓస్! అదెంత!" అని కంటకముఖి ఆ క్షణమే పక్కనున్న దళసరోవరంలోకి దూకి బంగారు తామరపువ్వుగా మారి, "పార్వతీ పరమేశ్వరుల సుపుత్రుడి కోసం వికసించా," అంటూ కిన్నెర మీటుతున్నట్లు పాట మొదలు పెట్టింది.

అన్నదమ్ములిద్దరూ వింత స్వర్ణపుష్పాన్ని చూసి దాన్ని పట్టుకొని నాది, నాది అని వాదులాడుకోసాగారు.

"అమ్మ చేసిన బొమ్మవు నీవు. మురికి ముద్దవు!" అని కుమారస్వామి విఘ్నేశ్వరుణ్ణి ఆక్షేపిస్తే, "నువ్వు మురికిగుంట శరవణ సరస్సులోంచి వచ్చావు!" అని విఘ్నేశ్వరుడు కుమారస్వామిని ఎత్తిపొడిచాడు.

కుమారస్వామి పిడికిలి బిగించి పొడవబోయాడు. విఘ్నేశ్వరుడు తొండంతో అతని చేతి



మణికట్టు బిగించాడు. ఇద్దరూ కలబడ్డారు. వినాయకుడు కుమారస్వామి నడుము తొండంతో బిగించి పైకెత్తాడు. కుమారస్వామి పైనుంచి బల్లాన్ని విఘ్నేశ్వరుడి బొజ్జకు గురిపెట్టాడు.

నారదుడు పరుగు పరుగున వచ్చి వారి కలహాన్ని నివారించి, ''ఆ పువ్వు కోసం ఎందుకిలా కలబడుతున్నారు. కావాలంటే, మీరిద్దరూ ఏదేనా పందెం పెట్టుకోండి,'' అన్నాడు.

సరేఅన్నట్టు తలఆడించాడువిఘ్నేశ్వరుడు.

కుమారస్వామి ఆలోచించి, ''ఎవరు విశ్వాన్ని చుట్టి ముందు వస్తే వారిదీ స్వర్ణ కమలం!'' అన్నాడు.

''బాగుంది!'' అన్నాడు నారదుడు నవ్వుతూ.

కుమారస్వామి వెంటనే నెమలిమీద విశ్వ ప్రదక్షిణానికి ఎగిరి వెళ్ళాడు.

విఘ్నేశ్వరుడు చతికిలబడి నిట్టూర్చగా నారదుడు, ''ఏం విఘ్నేశా! నీ సంగతేమిటి?'' అన్నాడు.

విఘ్నేశ్వరుడు, ''ఎవరికెంత ప్రాప్తో అంతే గాని స్వర్ణకమలం నాకు రమ్మంటే వస్తుందా, నారదా! నా బొజ్జతో, చిట్టెలుక వాహనంతో, నేనెక్కడ? విశ్వప్రదక్షిణ ఎక్కడ? సాధ్యమయ్యే పనేనా? ఫరవాలేదు తమ్ముణ్ణి తీసుకోనీ కమలం!'' అన్నాడు.

నారదుడు, ''విఘ్నపతీ! విశ్వజననీ జనకులైన పార్వతీ పరమేశ్వరులను దర్శిద్దామని వచ్చానుగానీ మళ్ళా వస్తాను,'' అని చెప్పి వెళ్ళాడు.

విఘ్నేశ్వరుడు చప్పున లేచి వెళ్ళి, ఒక తిన్నెపై కూర్చున్న పార్వతీశివుల చుట్టూరా ముమ్మారు ప్రదక్షిణ చుట్టి తమ్ముడి రాకకు ఎదురుచూస్తూ నిలబడ్డాడు.

చాలాసేపటికి ముప్పుతిప్పలుపడి విశ్వ ప్రదక్షిణం చేసిన కుమారస్వామి నెమలి వాహనం దిగాడు. విఘ్నేశ్వరుడు తమ్ముణ్ణి ఆప్యాయంగా కౌగలించుకొని, ''తమ్ముడా, పాపం చాలా శ్రమలుపడి విశ్వం చుట్టివచ్చావు; స్వర్ణకమలం నువ్వే వెళ్ళి తీసుకో, గెలవడం నేనే గెల్చానుగానీ, నాకది అక్కర్లేదులే!'' అన్నాడు.

కుమారస్వామి నివ్వెరపోతూ, ''అదెలాగ?'' అన్నాడు.

''నీకంటే ముందు నేనే ముమ్మారు విశ్వ ప్రదక్షిణ చేసి నిలబడ్డాను. ఎవర్నడుగుతావో అడుగు!'' అన్నాడు విఘ్నేశ్వరుడు.

''విఘ్నేశ్వరుడే గెల్చాడు!'' అని ఆకాశవాణి ముమ్మారు పలికింది.

కుమారస్వామీనిజం తెలుసుకొని, వినాయకుడి ముందు మోకరిల్లి, "అన్నా! నేను పెద్ద తపస్సు చేసి బ్రహ్మజ్ఞానం పొందానే కానీ, చిన్న విషయంలో అజ్ఞానంలోనే పడ్డాను. నువ్వు కుశాగ్రబుద్ధివి. నీ ముందు నేను ఎంత, నీ తరువాతవాణ్ణి గదా! తారకాసురుడిపై యుద్ధానికి వెళ్తున్నా, నన్ను ఆశీర్వదించు!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు కుమారస్వామిని లేవదీసి, "తమ్ముడూ! నేను పెద్ద అనీ, నువ్వు చిన్న అనీ అనుకోవద్దు, నీవు కారణజన్ముడివి! నీవు అన్నట్లుగా అమ్మ ఏదో ఆటగా చేసిన బొమ్మనే నేను; నీ కోసమే పార్వతీశివుల కళ్యాణం జరిగింది. వారి అనురాగఫలానివి! నీకు విజయంఎప్పుడో రాసిపెట్టింది. తారకాసురుడు నీ చేతనే చావాలని వరం కోరుకున్నాడు. నీవు సుబ్రహ్మణ్యేశ్వరుడివి! నాకు అన్నిచోట్లా మామూలు గుళ్లు ఉంటాయిగాని, నీకు కొన్ని ప్రాంతాల్లో గొప్పక్షేత్రాలు, పెద్దపెద్ద ఆలయాలు, గోపురాలు ఉంటాయి. ప్రముఖ దైవమూర్తిగా ఆరాధింపబడతావు. శీఘ్రంగా వెళ్ళి తారకాసురుడి బెడద వదిలించు!" అన్నాడు.

కుమారస్వామి దేవతలకు సేనాధిపతిగా తారకాసురుడిపై దాడికి వెళ్ళాడు.

యక్షుల అధిపతి కుబేరుడు కంటకముఖిని పట్టి తెప్పించి, "ఓసి, మాయలమారి పాపిష్ఠిదానా! అన్యోన్యంగా కలిసిమెలిసి ఉన్న పరమశివుడి కుమాళ్ళకే కలహం పెట్టావు, పల్లేరువై పడి ఉండు!" అని శపించాడు.

కంటకముఖి ప్రాధేయపడగా, విఘ్నేశ్వరుడి అనుగ్రహం వల్లనే శాపం తొలగుతుంది




అని చెప్పాడు కుబేరుడు. కంటకముఖి పల్లేరుముళ్ళడొంకగా భూమ్మీద మొలిచింది.

కుమారస్వామి దేవతలకు సేనానాయకుడై తారకాసుర నిర్మూలన చేశాడు. అతనికి దేవేంద్రుని కుమార్తె దేవయానను ఇచ్చి వివాహం జరిపించడానికి సర్వసన్నాహాలు చేయబడ్డాయిగానీ, అన్నకు కానిదే తమ్ముడికెలాగ చేయడం అన్నారు.

పార్వతి విఘ్నేశ్వరుడితో, "ప్రియనందనా! తమ్ముడి పెళ్ళి జరగాలంటే నువ్వు పెళ్ళి చేసుకోవడం నీ ధర్మం!" అన్నది.

"ఎందుకమ్మా! అలాంటి అర్థంలేని నియమాలు? ఎవరి ఇష్టానుసారం వారు చేసుకోకుండా తోక తెగిన నక్క సామెతగా నా లాంటి ఏకదంతుల్ని, ఏకాంతుల్ని రొంపిలోకి దింపటం మంచిది అనిపించుకోదు," అన్నాడు విఘ్నేశ్వరుడు.



విఘ్నేశ్వరుడు ఇలా ఎన్నో సాకులూ, విఘ్నాలూ కల్పించుకుంటూ వచ్చాడు.

ఒకసారి చాలా పట్టుదలతో పార్వతి పెళ్ళి చేసుకోమని తొందరపెట్టింది. ''అమ్మా! నేను తపస్సు చేయాలి! తమ్ముడు చేశాడుగాని పెద్దవాణ్ణయివుండీ నేను చేయలేదుగా,''అని విఘ్నేశ్వరుడు తపస్సుకి బయలుదేరాడు.

ఇంద్రుడు అప్సరసలందర్నీ విఘ్నేశ్వరుడి తపోభంగం చేయండని పంపాడు. అర్క అనే అప్సర అందుకు నిరాకరించింది. ఇంద్రుడు, పట్టరాని ఆగ్రహంతో, ''నువ్వు మహానీచురాలివి, అంటరాని జిల్లేడువై భూమ్మీద మొలు!''అని శపించాడు.

విఘ్నేశ్వరుడు తపస్సు చేయడానికి అనువైన చోటు వెతికి వెతికి ఎన్నుకున్నాడు. ఆ ప్రదేశంలో పల్లేరుడొంకలు నేలంతా విస్తరించి ఉన్నాయి. జిల్లేడు పొదలు మొగ్గలు నిండుగా తొడిగి విచ్చుకుంటూ వున్నాయి. విఘ్నేశ్వరుడు తపస్సు సాగిస్తున్నాడు.

అప్సరసలు అక్కడకు చేరి నాట్యం మొదలుపెట్టారు. వాళ్ళ కాళ్ళకు పల్లేరుకాయ ముళ్ళు గుచ్చుకొని పడిపోతుంటే ఒంటి నిండా పల్లేరుముళ్ళు గుచ్చుకుంటూంటే మూలుగుతూ ఆర్తనాదాలు చేశారు. విఘ్నేశుడికి ధ్యానభంగమై జరిగింది చూశాడు. పల్లేరు తీగపట్ల అభిమానం కలిగింది. అప్సరసలు భయంతో పడుతూ లేస్తూ కుంటుకుంటూ పారిపోయారు.

పల్లేరుగా మొలిచిన యక్షిణి కంటకముఖి, ''స్వామీ! ఏదో ఉత్సాహంకొద్దీ మీ అన్నతమ్ముళ్ళకు తగువుపెట్టి, కుబేరుడి శాపం పొంది ఇలా పడి ఉన్నాను, అనుగ్రహించు!'' అని వేడుకుంది.

ఆ రోజు సరిగా భాద్రపద శుక్లచవితి, వినాయకచవితి రోజే. విఘ్నేశ్వరుడు కంటకముఖి శాపం తొలగించి, ''వినాయకచవితి నాడు నీ పల్లేరుముళ్ళ కాయలను వికటవినోదంగా ఉపయోగిస్తారులే!''అని చెప్పాడు.

యక్షిణి మరుక్షణమే పరమానందంతో అలకాపురి చేరుకుంది.

అప్పుడు జిల్లేడు, ''స్వామీ! నన్నుకూడా అనుగ్రహించండి. ఇంద్రుడి ఆజ్ఞ నిరాకరించి శాపం పొంది అంటరానిదాన్నిగా ఇలా పడి ఉన్నాను. నేనెందుకూ కొరగానిదాన్ని, అర్క అనే అప్సరసను, నీయందు భక్తి శ్రద్ధలు గలదాన్ని!'' అంది.

విఘ్నేశ్వరుడు జిల్లేడుతో, ''అంటరానితనం అంటూ ఏదీ సృష్టిలో లేదు. నీ మొగ్గల్ని, పువ్వుల్ని నేను ప్రీతితో మాలగా ధరిస్తాను! నీవు



ద్వాపరయుగంలో కుబ్జవై పుడతావు. కృష్ణుడు నిన్ను ఏలుకుంటాడు. నీ శాపం పోయింది. సుఖంగా స్వర్గం వెళ్ళు. ఇంద్రుడివల్లగాని మరెవ్వరివల్లగాని నీ కెటువంటి భయమూ ఉండదు. ఏ శాపమూ తగలదు. జిల్లేడు వ్రేళ్ళు ఆయుర్వేద ఔషధాలకు ఉపయోగ పడతాయి. జిల్లేడాకులు సూర్యుడికి ప్రీతిగా ఉంటాయి!'' అని చెప్పాడు.

అర్క అప్సరరూపంతో స్వర్గాన్ని చేరుకుంది.

విఘ్నేశ్వరుడు కైలాసానికి తిరిగి వెళ్ళాడు. ''నాయనా, తపస్సు ముగిసింది కదా, మరి పెళ్ళి...''అని పార్వతి అంటూండగా, ''ముగియడమేమిటి? అసలు జరగనేలేదు. తిరిగి తపస్సుకెళుతున్నా!'' అని చెప్పి విఘ్నేశ్వరుడు మరోచోటు ఎన్నుకున్నాడు. ఆ ప్రదేశమంతా పాముల పుట్టల మయంగా ఉంది. చుట్టూ వలయంగా పుట్టలున్నట్టు చూసుకొని తపస్సు మొదలుపెట్టాడు. పుట్టల్లోంచి పాములు నిటారుగా లేచి పడగలు విప్పి బుసలుకొడుతూ కాపలా కాయసాగాయి. ఇంద్రుడు మూషికాసురుడి అనుచరులైన రాక్షసులకు, ''మీ యజమానిని వాహనంగా చేసుకొన్న విఘ్నేశ్వరుడు మిమ్మల్నందర్నీ నిర్మూలించడానికి తపస్సు చేస్తున్నాడు. పగతీర్చుకోండి!'' అని చెప్పి ఉసిగొల్పాడు.

రాక్షసులు వినాయకుడి మీద దాడి చేయగా మహాసర్పాలు పాతాళం నుంచి కట్టలుగా వచ్చి వాళ్ళ పొగరు అణిచాయి. చచ్చినవాళ్ళు చావగా మిగిలివాళ్ళు తమ తెలివి తక్కువను నిందించుకుంటూ ఇంద్రుణ్ణి తిడుతూ భయంతో అక్కడి నుంచి పారిపోయారు.

ఇంద్రుడు మంచి ఉల్లాసవంతులైన దేవతాపురుషుల్ని, వారితో అప్సరసలను కలిపి పంపుతూ, ''విఘ్నేశ్వరుడికి రాగోదయం కలిగేలాగ మీ ప్రతాపం చూపండి!'' అని ఆజ్ఞాపించాడు.

వాళ్ళ వెనుకనే వజ్రాయుధం పట్టి వెళ్ళాడు.

దేవతలు అప్సరసలతో జంటజంటలుగా సుర సేవిస్తూ కోలాహలం చేస్తూ పాటలు మొదలుపెట్టారు. నాగులు బుసకొడుతూ విరుచుకుపడి వాళ్ళను చుట్టుకొని కోరలతో కాట్లు వేయసాగాయి. ఇంద్రుడు నాగులపై వజ్రాయుధాన్ని ఝుళిపించాడు. నాగుల కోపం రెచ్చిపోయింది. నాగలోకం నుంచి బిలబిలమని మహాసర్పాలన్నీ వచ్చి దేవతల్ని స్వర్గానికి తరిమాయి. దేవతలకూ, నాగులకూ చిన్న యుద్ధంలాంటిది జరిగింది. ఇంద్రుడి వజ్రాయుధాన్నే లక్ష్యపెట్టకుండా నాగులు స్వర్గాన్ని ముట్టడించి గగ్గోలు పుట్టించి మరీ వెళ్లాయి.

విఘ్నేశ్వరుడు నాగుల సహాయానికి సంత సించి పాములను ఎత్తుకొని ముద్దాడి, అలంకా రాల్లాగ మీద వేసుకొని కైలాసానికి వెళ్ళాడు.

పార్వతి అతని పాములవాడి వాలకం చూసి నివ్వెరపోయింది.

''అమ్మా! తండ్రి సొత్తు తనయుడికి సంక్ర మించడం సహజమైందే గదా! శంకరాభర ణాలు నాకూ భూషణాలే! అదీగాక పాములు నాకు ప్రాణమిత్రులై ప్రాణాలకు తెగించి కాపు కాశాయి. ఆప్తమిత్రుల అండదండలే కదా నిజమైన దండకడియాలూ, అమూల్యాభరణా లూను! అందుకే నాగభూషాయ అనిపించు కున్నాను!'' అని విఘ్నేశ్వరుడు ఆనందంతో చెప్పాడు.

శివుడు చిరునవ్వులు ఒలికించాడు. పార్వతి వినాయకుడి వింత చేష్టకు విసుక్కుంది. ఆ విధంగా వినాయకుడు విఘ్నాలు తెచ్చి పెట్టు కుంటూ వచ్చాడు.

పార్వతి మళ్ళీ మరొకసారి బలవంత పెట్టింది. ''అమ్మా! ఏదైనా ఘనకార్యం చేస్తేనే గదా సమర్థుడనిపించుకుంటారు! నేనేదైనా చేసి, తమ్ముడిలాగ ఘనుడిననిపించుకోనిదే ఎలాగ పెళ్ళిచేసుకోమంటావు?'' అన్నాడు విఘ్నేశ్వరుడు.

''నీకేంతక్కువ నాయనా? సమర్థుడివి కాక వాజమ్మవా ఏమిటి!'' అంది పార్వతి.





# రామబంటు

ఒక చిన్న కొండమీద రాముడి గుడి వుంది. గుడి చుట్టూ కోతులున్నాయి. ఆ కోతులకు రామభక్తుడైన హనుమంతుడి అంశ అంతో యింతో వుంటుందని భావించే భక్తులు, రామాలయానికి వచ్చినప్పుడు వాటికి పళ్ళు, వేరుశనగలు, పప్పులు పెడుతూండేవారు.

ఒక రోజున కపిలుడనేవాడు, తల్లి దండ్రులతో ఆ రామాలయానికి వచ్చాడు. కపిలుడి తలిదండ్రుల ఆస్తిని దాయాదులు అన్యాయంగా కాజేశారు. న్యాయాధికారికి మొరబెట్టుకుందామంటే, ఆయన దర్శనం దొరకలేదు. న్యాయాధికారి ఇంటి కాపలా భటులకు, కపిలుడి తలిదండ్రుల దాయాదులనుంచి బాగా లంచం ముట్టింది. అంత కంటే ఎక్కువ ఇస్తేనే భటులు వారికి న్యాయాధికారి దర్శనం ఇప్పిస్తారు. అంత డబ్బులేక ఎవరి సాయమూ అందక, కపిలుడి తలిదండ్రులు శ్రీరాముణ్ణి ప్రార్థించడానికి కొండమీద గుడికి వచ్చారు. ప్రార్థన అయ్యాక వారు బయటకువచ్చి, తమచుట్టూచేరిన కోతులకు గింజలు విసురుతున్నారు.

కపిలుడివద్ద ఒక అరటిపండుంది కానీ అతడు దాన్ని కోతిమూకకు ఇవ్వలేదు. కొంచెం దూరంగావున్న ఒక ఒంటరి కోతి అతడి దృష్టిని ఆకర్షించింది. దాని కళ్ళల్లో తినాలన్న ఆశ కనబడుతున్నా కదిలి ముందుకు రాదేమను కుంటూ, అతడు దాన్ని సమీపించి చూసి, దాని కాలికి దెబ్బ తగిలిందని గుర్తించాడు. అతడు అరటి పండివ్వగానే అది ఎంతో సంతోషంగా తీసుకుంది. దారిలో ఏదైనా దెబ్బలాంటిది తగిలితే తొందరగా మానడానికి, తన గ్రామ వైద్యుడిచ్చిన లేపనం కపిలుడివద్ద వున్నది.

కపిలుడు ఆ లేపనాన్ని కోతి గాయానికి పూసి, "ఇక్కడుంటే నీకు తిండి దొరుకుతుంది కానీ, ఆరోగ్యం దొరకదు. మా మనుషులకైతే ఎన్నో సుఖాలూ, సదుపాయాలూ వున్నాయి. నువ్వు ఈ కొండ విడిచి మా ఊరు వచ్చేయ కూడదా!" అన్నాడు.

కళ్యాణ యశస్వి



తరచుగా మనుషుల మధ్య తిరిగే కోతికి, అతడి భావం అర్థమైందికానీ, అది అలా కపిలుడికేసి చూస్తూ వుండిపోయింది. కపిలుడు తన తలిదండ్రులతో వెళ్ళిపోయాడు.

ఆ మర్నాటికల్లా కోతికి గాయం నయమైంది. అది ఎంతో ఆశ్చర్యపడిజరిగింది మిగతా కోతులకుచెప్పి, మనమూ మనుషుల మధ్యకు పోయి జీవిద్దామన్నది. దానికి ఒక ముసలి కోతి కిచకిచమంటూ నవ్వి, ''మనుషుల్ని నమ్మకూడదు. వాళ్ళు దేవుడి గుడిదగ్గర వున్నట్లే తమ ఇళ్ళలోనూ ప్రవర్తిస్తారనుకోకు. మన కిక్కడే క్షేమం!'' అన్నది.

ఈ సలహా ఆ కోతికి నచ్చక, ఒక రోజున తనకు అరటిపండిచ్చిన ఒక ధనవంతుణ్ణి అనుసరించి అతడి ఇల్లు చేరింది. సాక్షాత్తూ హనుమంతుడే తనను కరుణించాడని భావించి, ఆ ధనవంతుడు దాన్ని చేరదీశాడు. ఆయన పిల్లలు ఆ కోతితో ఆడుకునేవారు. పనివాళ్ళు దాని అవసరాలు చూసేవారు. కోతికి అక్కడ ఎంతో బాగుంది కానీ, అయినా తన కోతిబుద్ధులు వదులుకోలేదు కదా!

ఒక రోజున అది ధనవంతుడి ఇంట్లోని వస్తువులన్నీ చెల్లాచెదురు చేసింది. పనివాళ్ళు వెంటబడి తరిమితే తోటలోకి పరిగెత్తి, మొక్కలకున్న పువ్వులను తుంచేసింది. చిన్నచిన్న మొక్కలను పీకేసింది. చెట్ల కొమ్మలను విరిచేసింది.

ధనవంతుడికి కోతిపట్ల కాస్తయినా ఆసక్తి వుంటే, దాని ప్రవర్తనను సరిదిద్దగలిగేవాడు. ఇక దాన్ని ఇంట్లో వుంచుకోవడం కొరివితో తల గోక్కోవడమే అనిపించిందాయనకు. ఏదైనా శాపం తగులుతుందన్న భయంతో ఆయన దాన్ని తిట్టలేదు, కొట్టలేదు. కోతుల నాడించేవాడికొకడికి అప్పజెప్పాడు.

ఈ కోతులనాడించేవాడి పేరు చింతయ్య. వాడికి దయాదాక్షిణ్యాలు లేవు. వాడు దాన్ని క్రూరంగా హింసించీ, భయపెట్టీ ఎన్నో విద్యలు నేర్పాడు. దాన్ని వీధుల్లో ఆడించి డబ్బు సంపాయించేవాడు. అయితే, కొద్దిరోజుల్లోనే ఆ కోతి మామూలు కోతులకంటే ఎక్కువ తెలివైనదని చింతయ్యకు అర్థమైపోయింది. చింతయ్య తనను ఆడిస్తూంటే, తన ఆటలకు చుట్టూ మూగిన జనం చప్పట్లు కొడుతూంటే, కోతికి ఏమాత్రం సంతోషంగా వుండేది కాదు. స్వేచ్ఛకు మించిన సంతోషం లేదని దానికి ఇప్పుడు బాగా తెలిసివచ్చింది.

ఒక రోజున చింతయ్య, కోతికి గులాబీ రంగుదుస్తులు వేసి, ఒకవీధిలో ఆడిస్తున్నాడు. ఎంతో ముద్దుగా కనబడుతున్న ఆ కోతిని

చూసి, ఆ దారిలో వెళుతున్న వజ్రాల వ్యాపారి మంత్ర ముగ్ధుడిలా ఆగిపోయాడు. అది గమనించిన చింతయ్య, కోతికి రకరకాలుగా సైగలుచేస్తూ, ''నువ్వు ఆ వజ్రాల వ్యాపారి చేతి లోని చిన్న మూటను దొంగిలించి తీసుకురా. నీకు స్వేచ్ఛ ఇస్తాను!'' అని దాని మెడ గొలుసును విప్పాడు.

కోతి నెమ్మదిగా గెంతుతూ వజ్రాల వ్యాపారిని సమీపించి, ఆయన చేతిలోని మూటను చటుక్కున లాక్కుని, తన దుస్తుల్లోపల దాచి అక్కణ్ణించి పరుగుపుచ్చుకున్నది. చింతయ్యా, వ్యాపారీ, చుట్టూ వున్న జనం అంతా తెల్లబోయారు. వాళ్ళలో కొందరు, ''పట్టుకోండి! పట్టుకోండి!'' అంటూ దాని వెంట పడ్డారు.

కోతి శక్తికొద్దీ పరుగుతీసి ఇంకొక వూరు చేరుకుంది. ఊరివాళ్ళు కొందరు దుస్తులు ధరించివున్న కోతిని చూసి వెక్కిరించడం మొదలుపెట్టారు. కొందరు రాళ్ళు విసిరారు. కోతికి ప్రాణభయం పట్టుకుంది. అది చెట్ల మీది నుంచి ఇళ్ళమీదికీ, ఇళ్ళమీది నుంచి చెట్లమీదికీ దూకుతూ, చివరకు ఒక ఇంటి తోటలో కూలబడిపోయింది.

అది కపిలుడి ఇల్లు. అప్పుడే తోటలోకి వచ్చిన కపిలుడు స్పృహ తప్పుతున్న కోతిని చూశాడు. అతడు ముఖం మీద నీళ్ళు చల్లి దానికి స్పృహ తెప్పించాడు. అరటిపళ్ళు ఇచ్చి ఆకలి తీర్చాడు. ఆసరికి కోతి అతణ్ణి గుర్తుపట్టి తన కాలు చూపించింది. ఆ కాలుకే రాముడి గుడి దగ్గర తను లేపనం పూశానని కోతి గుర్తుచేస్తున్నట్లు అర్థం చేసుకున్న కపిలుడు, ఆశ్చర్యం పట్టలేక, ''అమ్మా!'' అంటూ తల్లిని కేకవేసి పిలిచాడు.



ఆ కేక విని అతడి తలిదండ్రులిద్దరూ పరుగున ఇంట్లోంచి అక్కడికివచ్చారు. ఈ లోగా కోతి తను దుస్తులమధ్య దాచిన మూటను, కపిలుడికిచ్చింది. తండ్రి ఆ మూటను కపిలుడి నుంచి తీసుకుని విప్పి చూస్తే, జిగేల్మనే వజ్రాలు కనిపించాయి.

కపిలుడి తండ్రి ఆశపోతు కాదు. ఆయన ఆ వజ్రాలను జాగ్రత్తగా సంచీలోంచి బయటికి తీయగా, వాటి అడుగున ఒక కాగితం కనిపించింది. అందులో వజ్రాల వ్యాపారి పేరు, చిరునామా వున్నాయి. ఆయన వెంటనే, ''ఇవి లక్షలు విలువచేసే అపురూప వజ్రాలు! వీటిని పోగొట్టుకున్నవాడు చెప్పలేని దుఃఖంలో వుంటాడు. నేను తక్షణం బయల్దేరి వెళ్ళి, వీటిని చిరునామాదారుకు అందజేస్తాను,'' అంటూ అప్పటికప్పుడేపట్టణానికి ప్రయాణం కట్టాడు.

పట్నంలో వజ్రాల వ్యాపారి తన వజ్రాల మీద ఆశ వదులుకున్నాడు. కపిలుడి తండ్రి వాటిని తెచ్చి ఇచ్చేసరికి, ఆయన ఆశ్చర్యానందాలలో మునిగిపోయి, "ఈ కాలంలో మీవంటివారు చాలా అరుదు! నావల్ల మీకే సాయం కావాలన్నా నిస్సంకోచంగా అడగండి," అన్నాడు.

కపిలుడి తండ్రి తానున్న చిక్కుపరిస్థితులగురించి చెప్పుకున్నాడు. వజ్రాల వ్యాపారి వెంటనే, "అయ్యో! ఆ న్యాయాధికారి నాకు మంచి మిత్రుడు. మీకు క్షణాలమీద న్యాయం జరిగే ఏర్పాటు చేస్తాను," అంటూ, కపిలుడి తండ్రిని న్యాయాధికారి ఇంటికి తీసుకు వెళ్ళాడు. తన ఇంటి కాపలా భటులు లంచగొండులుగా మారారన్న విషయం ధృవపడగానే, న్యాయాధికారి వాళ్ళను పనినుంచి తొలగించి, కపిలుడి తండ్రికి, అతడి దాయాదుల నుంచి తిరిగి ఆస్తిని ఇప్పించేందుకు గట్టి ఏర్పాట్లు చేశాడు.

పట్టరాని సంతోషంతో ఇంటికి తిరిగి వచ్చిన తండ్రినుంచి జరిగినది విన్న కపిలుడు, "నాన్నా! మనకీ కోతివల్లనే ఆస్తిపాస్తులు తిరిగి లభించాయి. దీన్ని మనం పెంచుకుందాం," అన్నాడు.

"తప్పు, బాబూ! మనకెంతో మేలు చేసిన ఈ కోతి స్వేచ్ఛను మనం హరించాలనుకోకూడదు," అన్నాడు కపిలుడి తండ్రి.

కపిలుడు నిస్సహాయంగా కోతివంక చూశాడు. అది సైగలతో కపిలుడి తండ్రినే మెచ్చుకున్నది. అదీ మరి అనుభవాలద్వారా బ్రతుకును గురించిన పాఠాలు నేర్చుకుంది కదా!

వారం తర్వాత, కపిలుడి కుటుంబం కోతిని కొండమీది రాముడి గుడికి తీసుకు వెళ్ళి, అక్కడ విడిచిపెట్టారు. తమను కష్టాల నుంచి గట్టెక్కించినందుకు, శ్రీరాముడికి పూజలు చేసి తమ భక్తిని వెల్లడించుకున్నారు. అప్పటి నుంచీ కపిలుడి కుటుంబం ప్రతి ఏటా రాముడి గుడికి వెళుతూండేవారు. తలిదండ్రులు రాముడి దర్శనం కోసమే అయినా, కపిలుడు మాత్రం రాముడికంటే మిన్నగా, తన రామబంటును చూడాలనే వెళుతూండేవాడు. అంతేకాదు, ఎవరైనా చిన్న పిల్లలు కోతులపై రాళ్ళు విసురుతూంటే చూసి, "ఒరే, అలా కోతులపై రాళ్ళు విసరకండిరా! ఆదరిస్తే అవి మనకు వజ్రాలు తెచ్చివ్వగలవు," అని తన కథను చెబుతూండేవాడు.





# పోలయ్య నిర్వాకం!

పట్టణంలోని కచ్చేరీలో ఉద్యోగం చేసుకుంటున్న పరంధామయ్యకు, సొంతగ్రామంలో ఒక పాత పెంకుటిల్లూ, కొంత వ్యవసాయపు భూమీ వున్నది. ఆయనకు పిల్లా పీచూ లేరు. భార్య కాస్త జబ్బుమనిషి. ఇక ఇప్పుడు పరంధామయ్యకు ఉద్యోగ విరమణకాలం దగ్గరపడింది. పల్లెలోని ఇల్లూ, పొలమూ బాగుచేయించుకుంటే, శేషజీవితం పల్లెటూళ్ళో గడపొచ్చని ఆయనకు అనిపించింది.

ఆయన దగ్గర చాలాకాలంగా పనిచేస్తున్న పోలయ్య అనే ఒక నౌకరున్నాడు. పోలయ్య మంచి నమ్మకస్థుడే కానీ కాస్తంత మందబుద్ధి. పరంధామయ్యకు, పోలయ్య తప్ప తనపనులు చేసిపెట్టడానికి మరెవరూ కనిపించలేదు.

ఒకరోజు ఆయన పోలయ్యను పిలిచి, అతడు పల్లెలో చేయవలసిన పనులన్నీ పురమాయించి, అందుకు కావలసిన డబ్బు ఇచ్చి పంపాడు. పోలయ్య ఒక నెలరోజుల పాటు పల్లెలోనే వుండి, ఇంటి మరమ్మతులూ, పొలం బాగుచేయించడం లాంటి పనులన్నీ సక్రమంగా పూర్తిచేసి, పట్నం తిరిగివచ్చాడు. పరంధామయ్య, పోలయ్యను మెచ్చుకున్నాడు.

యజమాని మెచ్చుకోలుకు బాగా సంతోషించిన పోలయ్య, "కానీ, బాబూ! మన పొలంలో ఒక బావి తవ్విస్తే, బంగారం పండుతుందని గ్రామస్థులందరూ అన్నారు. తీసుకువెళ్ళిన పైకం తక్కువ అయింది. లేకపోతే ఆ బావిపనీ పూర్తిచేసుకువచ్చేవాణ్ణి!" అన్నాడు.

అందుకు పరంధామయ్య, "అలాగా, మరి ఆ కొరత కూడా ఎందుకు! మా గ్రామంలో ఒక ముప్ఫై అడుగుల లోతు తవ్విస్తే నీరు పడుతుందని చెప్తుతూంటారు. వెళ్ళి, ఆ బావి పనీ పూర్తిచేసుకురా," అంటూ అందుకు కావలసిన డబ్బిచ్చి పోలయ్యను పంపాడు.

రెండు వారాల తర్వాత పోలయ్య బిక్క మొహంతో తిరిగివచ్చి, "బాబూ! మీరు చెప్పి

గవ్వల నిర్మలాదేవి



నట్టే ముప్ఫై అడుగుల లోతు తవ్వించాను. కొద్దిపాటి ఊట తప్ప, చిన్న జల అంటూ కూడా పడలేదు!'' అన్నాడు.

జరిగినదానికి పరంధామయ్య కొద్దిగా నిరుత్సాహ పడ్డా, పోలయ్యతో, ''మరేం ఫర్వా లేదు! ఈసారి నలభై అడుగులు తవ్వించు, తప్పక నీళ్ళు పడతాయి,'' అంటూ మళ్ళీ డబ్బిచ్చి పంపాడు.

ఈసారికూడా పోలయ్య నీళ్ళు పడలేదనే కబురే పట్టుకొచ్చాడు. పరంధామయ్యలో పట్టుదల పెరిగింది. ''సరే, పోలయ్యా! ఏమ యితే అదవుతుంది. ఈసారి ఏభై అడుగులకు తవ్వించు. డబ్బుకు వెనకాడేది లేదు,'' అని మరికొంత డబ్బిచ్చి పోలయ్యను పంపాడు.

నాలుగు వారాలు గడిచాకపోలయ్య తిరిగి వచ్చి, యాభై అడుగులు తవ్వించినా నీరు పడలేదని పరంధామయ్యకు చెప్పాడు.

ఈసారి పరంధామయ్యకు చాలా ఆశ్చర్యం వేసింది. ఆయన భార్య శాంతమ్మకు, ఇదంతా నమ్మశక్యంగా కనబడకపోవడంతో, ''ఈ పోలయ్య అక్కడ ఏం నిర్వాకం చేస్తున్నాడో ఏమో! డబ్బుమాత్రం మంచినీళ్ళలా ఖర్చవు తున్నది. బావిలో మాత్రం నీటిచుక్క పడలే దన్నవార్తే మిగిలింది. నా మాట విని, కాస్త తీరిక చేసుకుని పల్లెకు వెళ్ళి రండి,'' అని భర్తకు సలహా ఇచ్చింది.

పరంధామయ్య కచ్చేరీకి ఒక రోజు సెలవు పెట్టి, పోలయ్యతోపాటు పల్లెకు బయలు దేరాడు. తీరా పొలంలోకి వెళ్ళిచూశాక తనకు మతిపోయినంత పనయింది. పొలంలో ముప్ఫై అడుగులదొకటి, నలభై అడుగుల దొకటి, ఏభైఅడుగులదొకటి–మూడు బావులు తవ్వించి వున్నాయి!

పరంధామయ్య, అతణ్ణి గట్టిగా చీవాట్లు పెట్టి ప్రయోజనం లేదని భావించి, ''పోలయ్యా, నువ్వు పెద్ద పొరబాటు చేశావు. మొదట తవ్వించిన ముప్ఫై అడుగుల బావినే, మరొక ఇరవై అడుగులు తవ్వించి వున్నా, నిక్షేపంలా నీళ్ళుపడి వుండేవికదా! డబ్బుకు డబ్బు వృధా అవడమేకాక, ఇవతల పొలమంతా గుంటల మయమైపోయింది,'' అన్నాడు.

ఇంత జరిగాక పోలయ్యకు తను చేసిన తప్పేమిటో అర్థమై కళ్ళనీళ్ళ పర్యంతమైపోతూ పరంధామయ్య పాదాలు తాకబోయాడు. పరంధామయ్య, అతణ్ణి వారించి, ''జరిగిపో యిందాన్ని గురించి బాధపడకు, పోలయ్యా! తక్కిన బావులు పూడ్పించి, ఒకబావిని మాత్రం మరికొంత లోతుగా తవ్వించు, తప్పక నీళ్ళు పడతాయి. నాకు ఒకరోజు సెలవే దొరికింది.

రేపు కచ్చేరీకివెళ్ళాలి,'' అని చెప్పి, పోలయ్యకు కొంత డబ్బిచ్చి, ఇల్లు చేరాక భార్యకు జరిగిన దంతా చెప్పాడు.

ఈసారి పోలయ్య నెలరోజులగ్గాని తిరిగి రాలేదు. బావిలో నీరుపడ్డదన్నవార్త సంతోషంగా మోసుకొచ్చాడు.

పరంధామయ్య కూడా సంతోషించి, "అలాగా! ఎన్నడుగుల లోతు తవ్వితేపడింది?'' అని ఆత్రంగా అడిగాడు.

అందుకు పోలయ్య, "అరవైఅడుగులకు. ఎలా అయితేనేం, మన పొలంలో బావినీళ్ళు సాధించాం!'' అన్నాడు పొంగిపోతూ.

పరంధామయ్య మిగిలినదంటూ పోలయ్య తెచ్చియిచ్చిన డబ్బు లెక్కచూసి, "రెండు బావులు పూడ్పించడానికీ, మరొక బావిని మరి కాస్త తవ్వించడానికీ హెచ్చుగానే ఖర్చ యిందే! ఇంతకూ ఏ బావులు పూడ్పించావు, ఏది తవ్వించావు?'' అని అడిగాడు

దానికి పోలయ్య వినయంగా, "మనం మొదట తవ్వించిన ముప్ఫై అడుగుల బావినే, మరొక ముప్ఫై అడుగులు తవ్వించాను, బాబూ! తర్వాత తవ్వించిన రెండు బావుల్నీ పూడ్పించాను,'' అన్నాడు.

ఈ జవాబు విని పరంధామయ్య నివ్వెర పోయి, "ఏభై అడుగులు తవ్వించిన బావిని, మరొక పదడుగులు తవ్వి వుంటే నీరు పడేది కదా? నీది చాలా గొప్పనిర్వాకం. ఎంత మంద బుద్ధివిరా, పోలయ్యా!'' అన్నాడు.

అప్పటివరకూ అంతా మౌనంగా వింటున్న శాంతమ్మ కల్పించుకుని, "వాడి మందబుద్ధీ, నిర్వాకం సంగతి అలావుంచుదాం. మీ సంగ తేమిటి? వాడు బావి తవ్వించే విషయంలో రెండుసార్లు పొరబాట్లు చేశాడని తెలిసీ, మీరు చేయవలసిందేమిటో వాడికి వివరంగా చెప్పారా, లేదు. కనక, అనవసరంగా జరిగిన డబ్బు ఖర్చుకు ప్రధాన బాధ్యత మీది, ఏమంటారు?'' అని అడిగింది.

" ఏమో, నువ్వు అన్నదే నిజమేమో!'' అంటూ పరంధామయ్య, పోలయ్య ఇచ్చిన డబ్బును మరొకసారి లెక్కపెట్టసాగాడు.



## హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్‌లో పాల్గొని ఆకర్షణీయమైన బహుమతులు గెలుచుకోండి!

# హీరోస్ ఆఫ్ ఇండియా - 10

మన ఇతిహాసాలైన రామాయణ, మహాభారతాలలో పలువురు మహావీరులు కనిపిస్తారు. వారిలో కొందరిని గురించి ఇక్కడ ప్రస్తావించాం. వీరిలో మీకు ఎంత మంది తెలుసో చూద్దామా?

అన్నీ సరైన సమాధానాలు గల మూడు ఎంట్రీలు సైకిళ్ళను బహుమతులుగా అందుకుంటాయి!



1. పుట్టినప్పటి నుంచి నా సోదరుడి పక్షం వదలలేదు. అయోధ్యను పాలించిన దశరథ మహారాజకుమారులలో నేను ఒకణ్ణి. నా పేరేమిటో తెలుసా?

------------------------------

2. వివేకవంతమైన నా సలహాద్వారా ఒకసారి నేను నా అన్నకుమారుల ప్రాణాలను రక్షించాను. నేను ధృతరాష్ట్రుడికి సోదరుణ్ణి కూడా. నేనెవరిని?

------------------------------

3. నా సోదరుడు సీతను అపహరించి, రాముడితో యుద్ధం చేశాడు. అయితే, నేను రాముడి పక్షం చేరి, ఆయన విజయానికి సాయం చేశాను. మీరు నన్నెరుగుదురు కదా?

------------------------------

4. నేను వాయుకుమారుణ్ణి. పాండవులలో ఒకణ్ణి. నాపేరేమిటి?

------------------------------

5. నేనొక గరుడపక్షిని. రావణుడు సీతను అపహరించుకుని వెళ్ళడం చూసి, రాముడు సీతను వెతుక్కుంటూ వచ్చినప్పుడు ఆయనకు తెలియజేశాను. మీకు నా పేరు తెలుసా?

------------------------------

ప్రతి ప్రశ్నకు దిగువ చుక్కలతో చూపినచోట మీ సమాధానాలను స్పష్టంగా రాయండి. ఈ ఐదుగురిలో మీకు చాలా ఇష్టమైన ఇతిహాసవీరుడు ఎవరు? ఎందుకు? అన్న విషయాలను పది పదాలకు మించకుండా రాయండి.

**నా అభిమాన ఇతిహాసవీరుడు:**

..............................

..............................

పాల్గొనేవారి పేరు: ..............................

వయసు: .............. తరగతి: ..............................

చిరునామా: ..............................

..............................

పిన్: .............................. ఫోన్: ..............................

పాల్గొనేవారి సంతకం: ..............................

తల్లి/తండ్రి సంతకం: ..............................

వివరాలన్నీ పూర్తిగా నింపాక, ఈ పేజీ కత్తిరించి 2002 ఆగస్ట్ 5వ తేదీ లోగా అందేలా ఈ చిరునామాకు పంపండి:

హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్-10
చందమామ ఇండియా లిమిటెడ్
82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ
ఈకాట్టుతాంగల్, చెన్నయ్-600 097.

సూచనలు:

1. 8-14 ఏళ్ళ లోపు వయసు పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
2. ఈ పోటీకి వచ్చే అన్నిభాషల ఎంట్రీల నుంచి ముగ్గురు విజేతలు ఎంపిక చేయబడతారు. విజేతలు వారికి తగిన సైజు సైకిళ్ళు అందుకుంటారు. సరైన సమాధానాలుగల ఎంట్రీలు ఒకటికన్నా ఎక్కువ వచ్చినట్టయితే, నా అభిమాన హీరో వివరణ ఆధారంగా విజేతలు ఎంపిక చేయబడతారు.
3. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
4. ఈ విషయంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
5. విజేతలకు విషయాన్ని పోస్టుద్వారా తెలియజేస్తాము.

బహుమతులను మీకు అందజేస్తున్నవారు



ఇదొక చందమామ కానుక!

# అజేయుడు గరుడుడు

17

చిత్రాలు: పాణి

కొండలమధ్య గుహాలయంలో నాగబంధు తలపెట్టిన యజ్ఞం, అర్ధంతరంగా ఆగిపోయింది. ఏదో పొరబాటు జరిగిపోయిందని భూతవైద్యుడు నరేంద్రదేవుడికి చెప్పాడు. దీనికంతకూ మూలకారణం ఆదిత్యుడేనని తాంత్రికుడు నాగబంధు మండిపడ్డాడు. నరేంద్రదేవుడి మనసులో అనుమానం తలెత్తింది. అదే సమయంలో, ఆదిత్యుడు రహస్య స్థావరంలో ఉన్న రాజును కలుసుకున్నాడు. రాజధానికి తిరిగి వెళ్ళాలనీ, ప్రజలను చూడాలనీ రాజు పట్టుబట్టాడు. ఆదిత్యుడు అందుకు తగిన ఏర్పాట్లు చేశాడు.

ఆదిత్యుడు గుర్రాన్ని అధిరోహించడానికి ముందు వీరబాహుకూ, అరుణకూ తగిన సూచనలు ఇచ్చాడు.

అరుణ రాజుగారి వెంట వెళుతుంది. రాజుగారి ప్రయాణం నిరాటంకంగా సాగడానికి వీలుగా, రవీంద్రదేవుడి సైనికుల బెడద లేకుండా చూడడానికి మన మనుషులను దారిపొడవునా ఏర్పాటు చేయండి.

ఆదిత్యుడు గుర్రం మీద మెరుపులా ముందుకు దూసుకు వెళ్ళాడు.

ఏమిటా అగ్నిగోళం? నాకేసే వస్తోంది. దాని ప్రకాశంలో మరేదీ కనిపించడం లేదే!

అది హఠాత్తుగా తుత్తునియలై, ఆదిత్యుణ్ణీ, అతడెక్కిన గుర్రాన్నీ చుట్టు ముట్టింది. ఆదిత్యుడు గుర్రంపై నుంచి ఎగిరి అవతల పడ్డాడు.

ఏమిటిది నేలపైబడ్డాను! గాలిలో తేలిపోతూన్న అనుభూతి కలుగుతున్నదే! నిజంగానే తేలిపోతున్నానా ఏం!

ఆహా! దివ్య తేజో రూపం! గరుడుడు!

అతని ఎదుట దివ్యతేజస్సుతో గరుడుడు ప్రత్యక్షమయ్యాడు.

దివ్యశక్తితో కవచంలా నన్ను కాపాడుతూన్నది గరుడుడే కదా!

నాయనా! తాంత్రికుడు నాగబంధు పరమదుర్మార్గుడు. మరో నలభై రోజులలోగా వాడు అర్ధాయువ బలిని ఇచ్చేలోగా వాణ్ణి నువ్వు హతమార్చాలి.

నన్ను స్మరిస్తూ నన్ను నీలో నిలుపుకున్నంత కాలం, నీకు ఎలాంటి హానీ కలగదు!

నన్ను తాంత్రికుడి దగ్గరికి నడిపించు ప్రభూ! వాణ్ణి ఈ క్షణమే హత మారుస్తాను.









అదే సమయంలో గుహాలయంలో నాగబంధు, అర్ధ రాత్రి సమయంలో భూతవైద్యుణ్ణీ, నరేంద్రదేవుణ్ణి రమ్మని కబురు పంపాడు.

ఒక యువకుణ్ణి గురించి... ఒక వింత కలగన్నాను. నా గురువుగారికి అతడే ఆఖరి బలి అవుతాడు!

నీ కుమారుడికి ప్రాణాపాయం ఉంది. ఆ యువకుడు రాజప్రాసాదం చేరేలోగా నీ కుమారుణ్ణి రాజ్యం వదిలి పారిపొమ్మని చెప్పు.

భూతవైద్యుడు నరేంద్రదేవుడి విస్మయమైన చూపులను పసిగట్టాడు.







తాంత్రికుడి ఇద్దరు శిష్యులు వెంటరాగా, భూతవైద్యుడు చాందినీ నదీతీరానికి బయలుదేరాడు.




నాగబంధు దృష్టి నరేంద్రదేవుడి కేసి మళ్ళింది.




తాంత్రికుడు నరేంద్ర దేవుణ్ణి ఆపాడు.




ఇంకావుంది

## వినోద సమయం

ఉత్సాహం ఉరకలు వేసే బాలలకోసం ఇది ప్రత్యేకం.
చక్కని వినోదం కలిగించడంతో పాటు మీ ఆలోచనా
శక్తికి పదును పెట్టే కార్యకలాపాలు!

### ఎగిరే భూతం!

ఈ భూతం తన పొట్ట పట్టేకన్నా ఎక్కువగా స్వాహా చేసింది. అది ప్రాణాలతో మింగేసిన ప్రాణులు ఏవి ఏవో గుర్తించగలరా?

### తేడాలను గుర్తించండి!

I



ఈ రెండు బొమ్మలూ చూడ్డానికి ఒకేవిధంగా ఉన్నప్పటికీ రెండింటికీ మధ్య కనీసం ఎనిమిది తేడాలు ఉన్నాయి. వాటిని గుర్తించండి చూద్దాం!

II



ఈ వినోద కార్యకలాపాలు
మీ సృజనాత్మక శక్తికీ, పరిశీలనా పటిమకూ
గీటురాళ్ళు!

## చేపబొమ్మ గీద్దాం

సరళరేఖలనూ, చిన్న చిన్న ఆకారాల గీతలనూ ఉపయోగించి చేపబొమ్మ గీయండి. ఇక్కడి సూచనల ప్రకారం క్రమక్రమంగా చిన్న చిన్న గీతలు గీస్తేచాలు. చేపబొమ్మ తయారవుతుంది!



## కుక్కపిల్లకు దారి చూపండి

కుక్కపిల్ల తన నేస్తం మల్లిని కలుసుకోవాలని ఉబలాటపడుతోంది. అయితే అది వెళ్ళవలసిన దారి చిక్కులమయం మాత్రమే కాదు; మార్గ మధ్యంలో భయంకరమైన ప్రాణులుకూడా కాచుకుని ఉన్నాయి. కుక్కపిల్ల తన స్నేహితురాలిని కలుసుకునే దారిచూపి సాయం చేయండి.



## ఒకే గీతతో....

ఈ సీతాకోక చిలుకలోని వింత విశేషం ఏమిటో తెలుసా? ఒకే ఒక పెన్సిల్ గీతతో ఈ బొమ్మ గీయబడింది. మీరూ ప్రయత్నించి చూడాలనుకుంటున్నారు కదూ? పెన్సిల్, కాగితం అందుకోండిమరి!






# ఫోటో వ్యాఖ్యల పోటీ





ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.పోటీ ఫలితాలు సెప్టెంబర్ 2002 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82,డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097

## అభినందనలు

మే నెల 2002 సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు:
బొడ్డపాటి రాజేశ్వరమూర్తి,
20/564-డి/ ఫ్రెంచి తోట
మచిలీపట్నం-521 002.(అం.ప్ర)

బహుమతి పొందిన వ్యాఖ్యలు



మొదటి ఫోటో: వృథాచేయకూడని వరం!
రెండవ ఫోటో: సదా ఆరోగ్యమిచ్చే ఫలం!

## వినోద సమయం- సమాధానాలు

తేడాలు గుర్తించండి: 1. మ్యూజిక్ నోట్ 2. అమ్మాయి గౌను మీది చుక్కలు 3. అబ్బాయి లాగుజేబు 4. చిలుక ఈకలు 5. అబ్బాయి నోరు 6. కుక్క భుజం మీది మచ్చ 7. పూలకుండీ మీది చుక్కలు 8. చిలుక ఒంటి మీది మచ్చ

ఎగిరే భూతం!



Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd. Chennai - 600 026 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam

